# ఆంధ్రభూమి



సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్ర మాసపత్రిక.

స్థాపితము ౧౯౩౩.
సాలుచందా 1-8-0.

సంపాదకుడు :
ఆండ్ర శేషగిరిరావు, బి.ఏ.

సంపుటము : ౪. ధాతు, ఆశ్వయుజము : అక్టోబరు, 1936. సంచిక : 3.


## సంపాదకుని విన్నపములు

**౧. సెప్టెంబరు మాసపు సంచిక వెలువడలేదు :—**

కారణాంతరములచే సెప్టెంబరు మాసపు ఆంధ్రభూమి సంచిక వెలువడలేదు. అందుచే మాచందాదారులకును, ఏజెంట్లకును, పాఠకులకును చాలనిరుత్సాహము కలిగించినవారమైతిమి. ఇందులకుగాను మేము వారిక్షమాపణ గోరుచున్నాము. పత్రిక చేరలేదను తహతహను వెల్లడించుచు ఈనెల మాకార్యాలయమునకు వచ్చిన నూరులకొలదిగనున్న లేఖలవలన ఆంధ్రభూమియందు ఆంధ్రమహాశయులకుగల ఆదరణాభిమానములను మఱియొకసారి గుర్తించుకొని నూతనోత్సాహమును పొందగలిగితిమి. సెప్టెంబరు మాసపు సంచిక వెలువడలేదు కావున మాచందాదారులకు పూర్వపులెక్క ప్రకారము చందా ధనము ముగిసిన మాసమునకుగాక మఱియొక మాసమునకుగూడ ఆంధ్రభూమిసంచికను చేర్చుకొందుమని మనవి.

**౨. ఆంధ్రభూమి 'దీపావళి' సంచిక :—**

నవంబరు ౧-వ తేదిని వెలువడవలసియున్న పై సంచిక నవంబరు ౧౦-వ తేదిని వెలువడును. నవంబరు ౧౩-వ తేదిని దీపావళి. నవంబరు మాసపు ఆంధ్రభూమి సంచికను దీపావళి సంచికగ వెలువరింప తలచియున్నాము. దీపావళి పండుగ నుపలక్షించి వెలువరింప తలచిన సంచికను సదరు పండుగ బాగుగ సన్నిహితమైనప్పుడు ఆంధ్రమహాశయుల కరకమలములకు అర్పింపవలయునను ఆకాంక్షతో ఆంధ్రభూమి ప్రచురణదినమును నవంబరుమాసమునకు మాత్ర మిట్లు మార్చితిమి. ఆంధ్రభూమి 'దీపావళి' సంచికకు యధోచితములగు వ్యాసములను, చిత్రములను ఈనెల ౧౫-వ తేదిలోపుగ పంపి మాయుద్యమమునకు పోషణప్రోత్సాహములు కలిగింప ఆంధ్రమహాశయులను ప్రార్థించుచున్నాము.

**౩. 'మాకు సంచికలు అంచులుకోయకుండ పంపుడు' :—**

ఆంధ్రభూమి కేవలము కథలనే ప్రచురించు పత్రికలవలె ఒకటిరెండుసారులు చదివి పారవేయదగిన పత్రిక కాదనియు, అందలి విజ్ఞానదాయకములగు వ్యాసములు మరల మరల చదువదగిన వనియు ఆకారణమున ఆంధ్రభూమి సంచికలు సంపుటములుగ కట్టించు కొనుచున్నామనియు మాచందాదారులలో వ్యక్తులు పలువురును, గ్రంథాలయములవారు కొంద

రును తెలుపుచు మాకు తడవులను బట్టి ఒక సలహాయిచ్చుచున్నారు. మామూలురీతిని ఆంధ్ర భూమిసంచికలు మాసము మాసము అంచులు కోసి పంపుచున్నాము. ఇట్లు అంచులు కోయ బడుటచే సంపుటములు కట్టించుకొనుటలో మార్జినులు కలియక పోవుటయు; పైన, క్రింద, కుడిప్రక్కను సంపుటముకట్టినపుడు రెండవసారి కోయుచుండుటచే ఎడమప్రక్కకంటె మార్జి ను బొత్తిగా సన్నగిల్లుటయు జరుగుచున్నది కావున తమకు సంచికలను అంచులు కోయకుండ పంపవలసినదిగ వారు వ్రాయుచున్నారు. మొదట మేము ఈవిషయమై శ్రద్ధ పెట్టనేలేదు. కాని ఈరీతిని కోరువారిసంఖ్య మాసముమాసమును హెచ్చుచున్నది. ఆకారణమున ఈవిష యమును గుర్తించకుండ నుండలేక పోవుచున్నాము. అందుచేతనే ఈమాసమునుండియు సం చికలు చందాదారులకు అంచులు కోయకుండ పంపుటకు ప్రారంభించితిమి.

౯. 'రబ్బరుగొట్టంధరించి స్త్రీసంభోగంచెయ్యడంమంచిదా?'

అను శీర్షికతో ఆగష్టుమాసపు ఆంధ్రభూమి సంచికలో ప్రచురింపబడిన వ్యాసమును గూర్చి విశేషవిద్యావంతులగు మిత్రులు చాల వ్యతిరేకభావమును కనుబఱచిరి. అయితే వారితో సంభాషించిన మీదట వారు వ్యాసమును చదువకయే ఒక్క శీర్షికనుబట్టి మాత్రమే అట్టి భావమును వెల్లడించినట్లు తెలిసినది. అందుపయి వారిని ప్రత్యేకముగ వ్యాసమును పఠిం పగోరితిమి. వారు వెంటనే చదివి ఆవ్యాసమునందలి విషయప్రాశస్త్యమున కెంతయు మెచ్చు కొనిరి. అట్టివిజ్ఞానము ముఖ్యముగ దేశమున వ్యాప్తము కావలయుననియు, అందును ఈవిష యమును స్త్రీలకు లెస్సగ బోధించుచో వారు కామాతురులగు తమపురుషుల వక్రమార్గ మును మాన్పింపగలరనియు వారు చెప్పినారు. విద్వాంసులగు ఆమిత్రుల అభిప్రాయములందు మాకు ఎంతటిగౌరవమున్నను వారు ఇట్లు చెప్పినంతమాత్రమున మాకు పూర్తితృప్తి కలు గలేదు. ఏమన, మాసము మాసమును ఆమాసపు సంచికలోని విషయములందు తమ కివి బా గున్నవి, ఇవి బాగులేవు అని వివరించుచు కొన్ని లేఖలు మాకార్యాలయమునకు వచ్చుచుం డుట వాడుక. ఆగష్టు సంచికను గూర్చియు అట్టిలేఖలు కొన్ని వచ్చినవి. ఆలేఖలన్నియు ఈ వ్యాసమువిషయమున ఏమియు చెప్పుటలేదు. ఆజాబులు వ్రాసినవారు ఈవిషయము నంతే చెప్ప రానిదిగతలంచిరో, ఇట్టి విషయమునుగూర్చి చెప్పుటకే బిడియపడిరో తెలియుటలేదు. వచ్చిన అన్ని ఉత్తరములు ఈవిషయమై మౌనమును వహించియుండుటచే పై మిత్రులు ఆవ్యా సమును సమర్థించినను మాకు సంపూర్ణమగు సంతృప్తిలేకపోయినది. అగుట ఈవిషయమై లోకాభిప్రాయమెటులున్నదో తెలిసికొనవలయునను కుతూహలము మాకు అగ్గలమైనది. ఈవి షయమున తమతమ అభిప్రాయములను లేఖామూలమున తెలుపవలసినదిగ మాపాఠకమహా శయులను ప్రార్థించుచున్నాము.

౯. సూచించినవ్యాసముల ప్రచురణ :—

గతసంచికలో ఈసంచికయందు ప్రచురింపబడునని ఏడువ్యాసముల నామములు సూచిం చితిమి. అందురెండింటిని మాత్రమే ఈసంచికయందు చేర్పగలిగితిమి. మిగిలిన ఐదును దీర్ఘము లైన వగుటచే ఇందుచేర్పలేకపోయితిమి. సదరు వ్యాసములు క్రమప్రచురణమందుననిమనవి.

# శర్మిష్ఠ

రచయిత :

రెండు చింతల నరసింహా శాస్త్రి

౧

[అశోకవనంలో : శర్మిష్ఠ స్వగతము.]

"జననీ ! యెంతవివేకమే ; తొలుత స్వేచ్ఛాభంగమైనందుకే
తనువుం బాయక యేమిగా నచట దైత్యాధీశు నంతఃపురాం
గనవై యిష్టములేని కాపురము చక్కంజేసి తీవార ? నన్
గని అచ్చో విడనాడి రమ్మనిరె గంధర్వాంగనల్ నీచెలుల్ ?

తీగ దొరంగి వాడు పువు తీరున నే కృశియించు చుండ నే
భోగము నాశలేమికిని మూలముగా జనకుండు, దాసిగా
యోగినిగా నొనర్చె నయయో గురుపుత్రికి దేవయానికిన్
వేగుదునా ప్రవాసభర వేదనతో జననీ! వచింపవే ?

అలరుం దేనియ లాని మత్తిలిన దారా యీద్విరేఫద్వంద్వ ; మి
క్కలనన్ మేలము లాడుచున్ వలపుకోర్కెల్ రేపుచుండంగ న
వ్వలపాలై తల యెత్త నోడి కృశియింపుల్ వడ్డ యీదీనురా
లెల ప్రాయమ్మున నే మనోవ్యథలచే నెట్లయ్యెనో చూతువా ?

మోటుదనాల చందనపు బొమ్మను గాక మనోరథాల ? నా
బోటుల కబ్బునే ప్రణయమూర్తుల పొందులు? చిన్ననాటనే
దాటితి భోగపుం దెరువు తల్లికి దండ్రికి భారమైతి నిం
కేటి సుఖాలు నాకు నిటులే యిటులే బ్రతుకెట్లు పుత్తునో !

జనకుని మాట దాటుటకు సాహసురాలను గానయేని ఇ
త్తనువు దొరంగి శాశ్వత ముద ప్రదమే ప్రకృతిన్ విలీనమై
తనరుట యొప్పుగా ; కిచట దాస్యమొనర్చుచు మానహీనజీ
వన మొనరించుకంటె వనవాసము మేలు స్వతంత్రశీలికిన్.

ఈకీనీడల నైక్యమొందుదునొకో, యీ పుల్గు నుస్గూతలం
దేకీభావము నొంది జీవవవనా లిట్టే దిగంతాలకున్
బ్రాకన్ గల్గునయేని అప్పుడు గదా పాటింతు రీపాటు ; లం
దాకన్ మూగియయుండునో మది దురంతవ్యాకులాంభోదముల్.

శోకాంభోనిధి గ్రుంగుచున్నది వయస్సోపాన మార్గం ; బికెం
తోకాలంబు మనంగలే నెటులు ; నాతో వెంట రానున్నవో
యీ కష్టానుభవా లటంచు వెరపౌ ; నెన్నెన్ని జన్మాలకున్
నాకాశావిఫలత్వసూచన లవీనాడే మదిందోచెడున్ !

మానవజీవితమ్మున సమస్తసుఖమ్ములలో ఘనమ్ముగా
దేని వచించుచుందురో సుధీవరు లుత్తమవృత్తు లప్రయ
త్నానుభవ స్ఫురత్ప్రతిభు లట్టి మహాప్రణయానురాగసం
ధానము లేమి నంతయు వృథాయయిపోయెనటంచు గుందెదన్.

వనరుచు నియ్యశోకవనవాటి దినమ్మొకయేడుగా, విరా
గిని నయి, తోడివారికడ కృత్రిమసౌఖ్యము నూని, గూఢవే
దనల భరించి జీవితపథమ్మున నొంటరిగా బ్రయాణ మిం
కేనడుపలేను లోని ప్రణయోద్ధతి నించుకయేని కోర్వలెన్.

ఆసల్ పోవిడనాడి లోన ధృతివాయంజెల్లునే నాకు ; నా
కై సంధిల్లిన విక్కుతంత్రములు మర్యాదల్ ; గమింపంగ నే
లా శంకింతును వీని ; నాహృదయజన్యప్రేమవాంఛల్ యథా
భ్యాసక్షేమకరమ్ము లౌనటుల చేయన్ పాప మెట్లౌనొకో !”

## ౨

[యయాతిని చూచిన మీదట]

“నా మనోహరుడతడు
నా ప్రణయఫల మతడు
నన్ను ప్రేమించునో !
న న్నెటు దలంచునో !

మా దృగంచలములు కూడి మూడినపుడె
స్రుక్కి సోలిన నెమ్మోము సొగపు దక్కి
పులకిత మ్మాచు నేవో యపూర్వకళల
జాగి యానందపారవశ్యతను జెందె !

వదులు వదులుగ చలువ దువ్వలువ లూని
మేడపై మసలు నతని జాడ గాంచి
హృదయ నిర్భేదకమ్ములై యెగయు లోని
కోరికల నెట్టు లణగంగ గొట్టుదాన ?

దాసి నయి యీ దేవయానికి
దైన్యమున మెలగంగ వలసెను
రాచకొమరిత నయ్యు సుకముకు
నోచ నయితినిగా.

ఈవనాంతము నందె యావ
జ్జీవ మిటులే వెళ్లబోతునె
బ్రతుకు బరువుల మోటుదేరిన
ప్రాణములతోనే.

అడవి గాచెడు వెన్నెలట్టుల
అంటరాని ప్రసూన మట్టుల
ఆరబెట్టిన దివ్వె యట్టుల
అయ్యెపో నాయందము.

ఏ భరింపగజాల నికపై
ఈమనోరథ దుర్నిరోధము
ఏ వహింపగజాల గురులకు
నీ యనిష్టపు వినయుము.”

## ౩

[సమాగమము]

యయాతి :

లలిత సౌహార్ద సంఫలిత విద్యావతీ !
మృదు మధుర వాక్సుధా సదమలాంతర్మతీ !
నీహృదయసౌధమున, నీప్రణయరాజ్యమున
నాకు తా వీయవా ? నను దిరుగనీయవా ?

శర్మిష్ఠ :

ప్రేమరస భరితము, మోహనా! మదీయ
విమల హృత్తామరసము అర్పించుచుంటి
ప్రియుడవై అందుకొని నాకు ప్రియమొనర్తొ,
దళములను జింపి బ్రతుకు వృథా యొనర్తొ !

యయాతి :

జ్యోతిర్విభాసితం బీతనూలత చూడ
విద్యుల్లతాంగి తా వెలసెనో యిచ్చోట
నాప్రణయఫలమ, నాపై ప్రసారింపవా
నీకృపాపాంగములకై కాచియున్నాను.

శర్మిష్ఠ :

ఈప్రేమసందేశ మెటుల నీచెవి దూరు
ఈప్రవాసక్లేశ మెటుల నాయెద దీరు
కనరాని కోరికలు కలగు నా గుండెలో
రాలై యెటొ త్రిగిల రాకున్నదో సఖా !
నిన్ను ప్రేమించి నీ నీడ నడుగిడ గోరు
నెచ్చెలిని గాన, గన్విచ్చి ననుజూడవా ?
నిండుజవ్వనమె కన్నీటిపాల్ సేతువా ?
వికచమందారమే ముకుళింప సైతువా ?

యయాతి :

త్రిప్పకోరాని యీ ముప్పు వాటిలె మనకు
నాకేటి పాడు బాంధవ్య బంధమ్ములే
ఊర్ధ్వలోకాలలో ఒదిగొదిగి యుండాము
భూలోకవాసులను పాలించుటలు మాని.

శర్మిష్ఠ :

మనప్రేమవిని మాని మండిపడిపోవునో
కఠినోగ్రశాప శిక్షల పాలు సేయునో
మనకేల యీగోల పదవో విజితారాతి!
పోదము నిర్జనవ్యోమపథమున దివికి !

యయాతి :

ఈయధికార గర్వమున నేసురి నిన్ పరికింప నైతిగా
కోయిల బంజరాన నిడి గ్రుడ్డితనమ్మున గాకి కూత కే
హోయి దలంచితిన్, విరసు డైతిని జీవితసారహీనతన్
మాయపరాధముల్ తలప మన్నన కర్హముకానె మానినీ !

శీలవతీ ! నినుం గుపరిశీలన చేసి గురుల్ త్వదీయ స్వే
చ్ఛాలలితప్రవృత్తమును సమ్మతిమై నరికట్టు టున్న దే
లాలిత చంద్రికన్ తళతళల్ విరజల్లు సరోంబువీచులం
దేలెడు పద్మమున్ తిగిచి నీళుల ద్రెళ్లగ జేయు టయ్యెబో !

చెలియా! ధన్యుడ నైతిబో ప్రణయ లక్ష్మీ దివ్యరాహస్యముల్
తెలియంగాంచితి ని మ్మహానుభవకాంతిన్ ; మాంద్యతల్ వోయె ; కే
వల శారీరిక భోగ లాలసుడనై వ్యర్థుండనై పంకసం
కలితాంతర్మతినైన నాకు నివి ముక్కుల్ మంచిగందంబురన్ !

# 'పంచవటి' పరామర్శ

రచయిత:

ఎన్. ఆర్. చందూరి

పంచవటి. ఇది వినోదినీ సంపాదకులగు శ్రీనివాస శిరోమణిగారిచే రచింపబడి, పి. గోపాలస్వామినాయుడుగారిచే ప్రకటింపబడ్డది. అయిదు అమూల్యరత్నాల సముదాయం. వెల ఆరు అణాలుమాత్రమే.

ఆశయములేనికథ శ్రీనివాస శిరోమణిగారి కలంనుంచి వెలువడదనే విషయం పాఠకలోకానికి కొత్తకాదు. అసమానములూ, అద్భుతములూ అయిన అయిదు కథల్ని ఆంధ్రదేశాని కుపాదించి శిరోమణిగారు ధన్యులయారనడంలో అతిశయోక్తి వుండదు.

అయిదుకథల్లోనూ, 'దారిద్ర్యం' అనే నాల్గోకథగురించి తర్వాత చెప్తాను. మొదటి కథ 'ప్రతిఫలము.' రెండోది 'ఏకాకినీ', ఈ రెండిట్లోనూ నాయికలు సీతలే! కాని 'ప్రతిఫలము'లోని సీత బి.ఏ. చదువుతున్న సున్నితహృదయ; 'ఏకాకినీ'లోని సీత 'త్రేతాయుగములో రామదూతగానూ, ద్వాపర యుగములో అర్జునుడి టెక్కముమీదనూ, కలియుగములో యింటింటా ప్రతి కిరసనాయిల్ డబ్బామీదనూ, కుప్పిగంతులు వేస్తూ వున్న కోతిదేవుడు యిలవేల్పు'గా కలిగిన విశాలహృదయంలేని బాల. శిరోమణిగారు 'ప్రేమలేఖ'లోని సామాన్యపు కమల నీచత్వానికి వడిగట్టిన రాముడిగురించి భయపడినరీతి ఎంత రంజకముగా సృష్టించారో, అంత రంజకముగానే 'శృంగభంగం'లోని నాగరిక లలిత మూర్ఖుడైన గోపాలరావు ఎడ ప్రవర్తించిన విధాన్ని ప్రదర్శింపజేసారు.

అన్ని కథలకంటె 'ప్రతిఫలము' పెద్దకథ. మంచి ఘాటుగావుంది. ఈకథ 'హిందూలా' లోవున్న వోపెద్ద లోటును విమర్శిస్తోంది. ఇందులోని మోహనుడు వ్యక్తిత్వంలేని కుర్రకుంక. జాలిపుట్టించే జీవితచరిత్ర సీతది. 'దౌర్భాగ్యముగావున్న దేశములో పరమహంసలూ, రామతీర్థులూ పుట్టి కొంచెము కొంచెము వికాసము కలుగుతున్న యువకుల హృదయాల్నీ, దేశాన్నీ ధ్వంసముచేస్తున్నార'నే పౌరుషభారతవీరుడు చౌదరి.' రేపు వివాహపురద్దు విషయమయి శాసననిర్మాణసభలో ప్రతిపాదిస్తాననుకో. అప్పుడేమి జరుగుతుందంటే, ఊరూరా బ్రాహ్మణోత్తములు సభలుచేసి ఈపుణ్యభూమికి అగ్గి అంటుకుపోతున్నదని మహాజర్లు పెడ్తారు.' అబద్ధమా? శారదాబిల్లు అమల్లోకి రానున్నప్పుడు మన మిలాటి విషయాలు గమనించలేదూ? సంఘాన్ని దద్దరిల జేసేందుకు శాస్త్రాన్నికోరి, ఆవేశంచేత మోహనుణ్ణి కూనీచేసిన శాంత హృదయుడు వాసుదేవరావు. కాని కథ మాత్రం ట్రాజిడీ కాదు!!

ఇక, 'ఏకాకినీ.' ముందువెనుక లాలోచించని తొందరయువకుడు నాగేశ్వరరావు. కామమనే యానిమల్ యిన్ స్టిన్క్ట్ మనస్సులో ప్రవేసించేవరకూ భర్తయొక్క విలువ తెలిసికోలేని అజ్ఞాని సీత. తనవాళ్లని సౌఖ్యపెట్టేమార్గాలు తెలీని మూర్ఖుడు వెంకయ్య.

'శృంగభంగం' లోని లలిత కామాతురతచేత ప్రవర్తించిన నడతకి ప్రేమరసమనే ఆనందాన్ని తెలిసికోగానే ఎందో ఖేదించిన పవిత్రహృదయ. ఆమె అబలకాదు; సాహసికురాలు. 'ప్రేమలేఖ'లోని కమల ఒకటో రకమైన సంసారస్త్రీ.

మిగిలిపోయింది 'దారద్వయం.' ఈకథలో నీలగిరి వెళ్లిన సత్యభామ అయిదురోజులైన తర్వాతకూడా తిరిగి రాకపోవడానికి కారణ మగుపించడంలేదు. వెంకటేశ్వరరావుకి ఉత్తరంకూడా రాకపోవడం వో వింతే! నాయకుడైన వెంకటేశ్వరరావు హృదయదార్ఢ్యం యిసుమంతైనా లేని నేటికాలపు యువకులలో ఒకడు. సత్యభామ ఎడ ఇతనికుండే ప్రేమకూడా, పురుషుడికి స్త్రీ మీద వుండే సహజవ్యామోహంలా పొడగట్టుతోందికాని, స్వచ్ఛందమైన ప్రేమ అని ఊహించడానికి తగు కారణాలు అగుపించడం లేదు. తక్కిన నాలుగుకథలూ వోఫక్కీ, యిదింకో ఫక్కీ.

అయిదూ సంస్కరణీయములైన విషయాల్నిగూర్చిన కథలే! అయిదూ వివాహమైపోయిన తర్వాత వచ్చే సమస్యలగురించినవే! దౌర్భాగ్యస్థితిలోవున్న ప్రస్తుతపు ఆంధ్రదేశానికి కావలసిన కథలిలాటివే! ఉపన్యాసాలవల్లనూ, వ్యాసరచనలవల్లనూ జరిగే సంఘసంస్కరణాలకంటె, యిలాటి కథలు యువకహృదయాల్ని వికసింపజేయడానికి సాయపడ్తాయి. ఈకథలు బీదవారియందు వుండే జాలిని విశదీకరించేవీ కావు; భాగ్యవంతుల దుబారాల్ని బయలుపెట్టేవీ కావు. సంఘంలోని సాధారణమూనవులగురించిన విషయాలే! ఆసంఘంలోవుండే లోపాల్ని పాఠకలోకంయొక్క హృదయానికి అతుక్కుపోయేటట్టు అపురూపమైన కథల్లో యిమిడ్చారు శిరోమణిగారు. పాఠకుడు కథపూర్తిచేసిన అయిదు నిముషాలవరకూ 'అరేరే!' అని అనుకొనేటట్టు వుంది ప్రతి కథా. 'ప్రతిఫలము' చదివిన ప్రతివ్యక్తీ విడాకులచట్టం 'హిందూలా'లో లేకపోవడం గొప్పలోపం అని వప్పుకుతీరవలసిందే! మనోవికాసములేని స్త్రీవల్లనూ, మూర్ఖులగు ముదుసలులవల్లనూ దగ్ధమయ్యే సంసారాల్లో ఒకటి సృష్టించబడ్డది 'ఏకాకినీ'లో. స్త్రీయొక్క దైన్యమూ, పవిత్రతా, సాహసమూ ప్రదర్శింపబడ్డాయి 'శృంగభంగం'లో. సంసారకాంతయొక్క నైజగుణాలు కనపట్టుతాయి 'ప్రేమలేఖ'లో. 'దారద్వయం' గురించి నేనేమీ వ్రాయదలచుకోలేదు. మీరే చదివి ఆనందించండి.

ఆంధ్రయువకజనమంతా చదివి ఆనందించి, మెచ్చుకోవలసిన గ్రంథరాజాన్ని ఆంధ్రమాతకు కానుకగా ఇచ్చారు శిరోమణిగారు. శిరోమణిగారు యిలాటి కథల్నే మరికొన్ని ఆంధ్రదేశానికి సమర్పించి, సంఘసంస్కరణాని కనువగు ఈనూత్న పంథాకు ఆదర్శపురుషులుగా వుంటారని నా నమ్మిక.

# కవికొండల వెంకటరావు

రచయిత:

చేకుమళ్ల కామేశ్వరరావు, బి.ఏ., బిఇడి.

ఈ కవియొక్క స్వగ్రామం రాజమహేంద్రవరం తాలూకాలోని శ్రీరంగపట్నం. తండ్రిపేరు నరసింహారావుగారు. తల్లిపేరు శేషమ్మగారు. శేషమ్మగారి తండ్రిపేరు గాడిచర్ల రామయ్యపంతులుగారు. నరసింహారావుగారికి వేరే ఉద్యోగంలేదు; భూవసతి ఉన్నవారు. కవికొండల వారిది భారద్వాజస గోత్రం, యాజ్ఞవల్క్యశాఖ, కాత్యాయనీసూత్రం.

వెంకటరావుగారు 2-7-1892 (నందన సం॥ ఆషాఢ బహుళ ఏకాదశినాడు జన్మించారు. శేషమ్మగారికి కలిగిన ముగ్గురి సంతానంలోనూ – ఈ ముగ్గురూ కొడుకులే – వెంకటరావుగారే పెద్దవారు. వెంకటరావుగారి తల్లిగారు 1899 లో పాతికేళ్లు నిండకమునుపే చనిపోయారు. అటుతర్వాత నరసింహారావుగారు తిరిగి వివాహంచేసుకున్నారు. రెండోభార్యకు ఒక కుమార్తెమాత్రమే కలిగింది. వెంకటరావుగారు సవితితల్లివల్ల సుఖపడ్డారుగాని కష్టపడలేదు.

కవిగారు చిన్నతరగతులన్నీ శ్రీరంగపట్నంలోనూ, రాజమహేంద్రవరంలోనూ చదివారు. తర్వాత పెద్దచదువు బి.ఏ. వరకూకూడా రాజమహేంద్రవరంలో చదివారు. మెట్రిక్యులేషన్ పరీక్ష 1908 లో పాసయారు. బి. ఏ. 1913 లో పాసయారు. వీరు బి.ఏ. వరకూ కూడా ఒక్క పరీక్షలోనూ తప్పిపోలేదు. తర్వాత చదివిన బి. యల్. లో మాత్రం ఒకసారి తప్పిపోయిరి. బి. యల్. పరీక్షపోగా ఒక సంవత్సరం నరసాపురం టైలరు ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేశారు. బి.ఎల్. పాసయి రాజమహేంద్రవరంలో మొదట ప్రాక్టీసు మొదలెట్టారు. 1916 నుంచి 1922 వరకూ రాజమహేంద్రవరంలోనే ఉన్నారు. తర్వాత నరసాపురం వెళ్ళారు. అక్కడ 1922 మొదలు 1933 వరకూ ప్రాక్టీసుచేశారు. 1933 లో తిరిగి వీరు రాజమహేంద్రవరం వచ్చారు. ఇప్పుడు ఇక్కడే ప్రాక్టీసు చేస్తున్నారు.

వెంకటరావుగారికి 14-వ ఏటే వివాహం అయింది. భార్యపేరు వివేకవర్ధనమ్మగారు. జోస్యుల నారాయణమూర్తిగారి కుమార్తె. ఈమె 1909 లో స్వర్గస్థురాలయింది. వెంకటరావుగారు తిరిగి 1910 లో వివాహంచేసుకున్నారు. ఆమెపేరు దమయంతి లక్ష్మీదేవమ్మగారు; గడిదాసు వెంకటచలంగారి కుమార్తె. వెంకటరావుగారికి ఒక కొడుకూ, నలుగురు కూతుళ్లూ. కవిగారి తండ్రిగారు 1919 లో ఏభైఅయిదోయేట చనిపోయారు.

ఈ కవియొక్క పూర్వులు ఎవరూ కవిత్వం చెప్పినట్లు కనబడదు; కాని వాఙ్మయంలోమాత్రం ఎక్కువ అభిరుచికలవారు. వెంకటరావుగారు కవిత్వం చెప్పడం 1910 లో ప్రారంభించారు. అనేక గ్రంథాలు రచించారు. (1) 'భారతీయసందేశం' ఇది ఒక చిన్ననాటకం. ఇది మొదట శ్రీనాళం కృష్ణారావుగారిచే నడిపించబడ్డ 'మానవసేవ' పత్రికలో 1912 లో ప్రకటించబడింది. ఆయేడే గ్రంథరూపంగా వెలువడింది. (2) 'అనాథాభ్యుదయం'. ఈచిన్న నాటకంకూడా మానవసేవలోనే పడింది. పడినవెంటనే పుస్తకరూపంగా 1913 లో వెలువ



కవికొండల వెంకటరావు

డింది. (3) 'విజయసవనం'. ఈనవల చాలావరకూ 1916 ప్రాంతాల్లో పిఠాపురంలో ప్రకటించబడ్డ 'ఆంధ్రసేవ' పత్రికలో ప్రకటించబడింది. కాని ఆ పత్రిక అంతట్లో ఆగిపోడంచేత పూర్తిగా ప్రకటించబడలేదు.

కవిగారు అనేక ఖండకావ్యాలు రచించారు. వీటినన్నిటినీ అనేక పుస్తకాలుగా ప్రకటించారు. 1916 లో 'వివిధ కుసుమావళి' అచ్చువేశారు. ఇది మూడోసారికూడా ముద్రించబడింది. 1924 లో 'భావమురళి', 'జనపదములు', 'కుమారకంఠం' 'మాతృదేశ సంకీర్తనం', 'కలరుతం' అనే అయిదు చిన్న పుస్తకాలు ప్రకటించారు. 1925 లో 'ప్రకృతి చందనం', 1926 లో 'ఆత్మవ్యక్తి', 1927 లో 'నెలబాలుడు' అను పుస్తకాలు అచ్చువేశారు. 1929 లో 'ఆగడపలు', 'చదువులముత్తె', 'చిట్టికైత', 'పొట్టికత' అనే నాలుగు పుస్తకాలు ప్రకటించారు. వీటిలో 'పొట్టికత' మాత్రమే వచన గ్రంథం. 1930 లో 'త్రయి' అనే పద్యగ్రంథం, 'కోనేరు' అనే చిన్ననాటకం, 'విప్రసందేశం' అనే నాటకం—ఈనాటకం 1911 లోనే రచించబడింది—, 'జంటలు' అనే వచనగ్రంథం ప్రకటించారు. వీరిరచనలు సాధారణంగా ఈకాలపు పత్రికలన్నిటిలోనూ పడుతూనే ఉంటాయి. వెంకటరావుగారి కవిత్వం అసామాన్యమైనది.




# అనుభవవైద్యుని అమృతసూక్తులు

ఏడాదికి ఓసారన్నా నేరేడుపళ్లు తినాలి. మనం తినే ఆహారంతో లోపలికిపోయి కడుపులో ఎన్నాళ్ళకి జీర్ణంకాకుండా వుండిపోయే వెంట్రుకల్ని అవి జీర్ణంచేస్తాయి.

... ... ...

అజీర్ణరోగులు ఆహారాన్ని ఎంతబాగా నమిలితే అంతమంచిది.

... ... ...

మూలశంకరోగంతో బాధపడేవారు మజ్జిగను విస్తారంగా వుపయోగిస్తే గుణకారిగా వుంటుంది.

... ... ...

అన్నంతినగానే సంభోగంచెయ్యడం కుష్ఠురోగం కలగడానికి కారణాలలో ఒకటి.

... ... ...

నేత్రరోగం, దంతరోగం, కర్ణరోగం, మూర్ఛరోగం వున్నవాళ్లు ఎప్పుడూ తాంబూలంవేసుకోకుండా వుండడం మంచిది.

... ... ...

వేపనూనె ముసలితనాన్ని పోగొట్టుతుంది.

... ... ...

తియ్యదొండకాయలకూర బుద్ధిబలాన్ని నాశనం చేస్తుంది.

... ... ...

నీరులేకుండా వేయించబడ్డ శనగలు కుష్ఠురోగాన్ని వృద్ధిపొందిస్తాయి.

... ... ...

ఎప్పుడూ పేరిననెయ్యే వేసుకోవాలి. రెండోసారి వెచ్చచెయ్యగానే నెయ్యి విషతుల్యం అవుతుంది.

ఎప్పుడూ కాచి చల్లార్చిననీళ్లే పుచ్చుకోవాలి. కాని రాత్రి కాచిననీళ్లు పగలున్నూ, పగలు కాచిన నీళ్లు రాత్రిళ్లున్నూ తాగకూడదు.

... ... ...

బూడిదెగుమ్మడికాయలో పైచర్మానికి లోపలి గిజరుకు మధ్యనువుండే పదార్థం ఇంద్రియవృద్ధికరంగాను, ఇంద్రియదోషాన్ని పోగొట్టేదిగానువుంటుంది.

... ... ...

బెల్లంలో పాతబెల్లం చాలామంచిది. కాని మూడుసంవత్సరాలకు పైబడిన బెల్లం ఎట్టిగుణంకాని లేకుండా వుంటుంది.

... ... ...

నోటియందు నీరుఊరడం అతిగావున్నట్లయితే చుక్కకూర వంటకంతీసుకోవడం ఎంతేనా గుణకారిగా వుంటుంది.

... ... ...

నోటిపూతను, నోటిదుర్గంధాన్ని పోగొట్టుకోడానికి తేనెను వాడాలి.

... ... ...

పులుసు పెట్టని చేమదుంపలకూర, బెండకాయకూర వీర్యాన్ని గట్టిపరుస్తాయి.

... ... ...

తాంబూలంలో కాచు (కవిరి) ఎక్కువగా వేసుకుంటే శుక్రనాశనం అవుతుంది.

... ... ...

చిలికినమజ్జిగలో వెన్న పూర్తిగా తీసెయ్యాలి. అట్లాకాక వెన్నకలిసిఉన్న మజ్జిగ వుపయోగిస్తే మైకం, బద్ధకంకలిగి జబ్బుచేస్తుంది.

# గాంధి—లెనిన్

## వారి రాజకీయ సిద్ధాంతములందలి తారతమ్యములు.

రచయిత:

ఆచార్యరంగా, యం. యల్. ఎ.

[1. గాంధి, లెనిన్‌లు ఇరిద్దరును క్లుప్తజీవితమును అభిలషించినవారె.

2. ఇద్దరికి తమతమ పార్టీలలో ప్రతి ఒక్కరిని ఏనియమముతోను చేర్చుకొనుట అయిష్టమే. కనుకనె లెనిన్‌గారు మెన్‌షివిక్ పార్టితో తిరుగబడి తన బోల్‌షివిక్ పార్టియందు తమ సిద్ధాంతములయందు సంపూర్ణముగా విశ్వాసముగల్గి తగిన త్యాగముచేయ సిద్ధమైనవారినే చేర్చుకొనదలచెను. మహాత్ముడును అస్పృశ్యతను పాటించక, నూలువడకి స్వయంకృషిచేయువారినే కాంగ్రెసులో చేర్చుకొనవలెనని ప్రతిపాదించెను.

3. ఇద్దరును విప్లవకారులే. ఆ విప్లవమును సాధించుటకు ఇద్దరికి విప్లవ సంబంధమైన ఆదర్శమే కలదు. ఆ పద్ధతులనే అవలంబించిరి.

4. ఇద్దరును అపారమగు త్యాగులే. లాయరులే. ప్రభుత్వములచే బాధలుపొందినవారే. కాలము యొక్క అవసరములను అనుసరించి పద్ధతులను మార్చుకొనినవారే. మార్చుకొనగల్గినవారే.

5. ఇద్దరికి దేశవ్యాప్తమైన సమ్మె యిష్టమే. ఒకరు దానిని (నాన్ కోఆపరేషన్) సహాయనిరాకరణోద్యమము అంటారు. మరొకరు దానికి దేశవ్యాపితమైన సమ్మె (జెనరల్ స్ట్రయిక్) అంటారు. ఒకరు అహింసాపద్ధతి అంటారు. మరొకరు దేనినైన అవలంబించవచ్చును అంటారు.]

### గాంధిజీ.

1. తాను అవలంబించు ప్రతి యొక్క పద్ధతియు తప్పని సరిగా అహింసాపరముగనే యుండవలెననియు, ఏవిధముగను హింసామార్గమునకు దారితీయరాదనియు పట్టుదలగలదు.

2. వీరు దేశీయస్వాతంత్ర్యమును సంపాదించుటకు ప్రయత్నించుచున్నారు. అందులకై హిందూ

### లెనిన్ గారు.

1. ఈయనో అటుకాక కార్మిక కర్షకులకు అవసరమగు, సాధ్యమగు పద్ధతిని అవలబింపవచ్చునను కొనిరి. కాని ఆ రోజులకు ఈ హింస, అహింస వివాదములు యింత తీవ్రముగా బయలుదేరిలేవు. పైగా అహింసాపూర్వకపు సత్యాగ్రహపు సత్తా అప్పటికి ప్రపంచానికి తెలియబడలేదు. కనుక మహాత్ముని పద్ధతి ఎంతవరకు కార్మిక కర్షకులకు అనుసరణీయమో చర్చించుటకుగాని ప్రకటించుటకుగాని వారికి అవకాశము లేదాయెను.

2. వీరు స్వరాజ్యమునే అనుభవించుచున్న తమ దేశపు చక్రవర్తి పాలనమును పోగొట్టి కార్మిక

మహామ్మదీయసమస్యను తేల్చవలసివచ్చెను. అందు అపజయమొందిరి. హరిజనసమస్యను తేల్చగల్గిరి. బ్రిటిషువారి సామ్రాజ్యతత్వమును భారతదేశమునకు సంబంధించినంతవరకు ఎదుర్కొనుటకు పూనుకొనవలసివచ్చెను. మిగతా భాగముతో అంతగా సంబంధము పెట్టుకొనుటకు అవకాశము లేకపోయెను.

3. గాంధిగారి శైశవము రాజులయందు భక్తితో పెరిగినది.

4. రాజకీయ దాస్యమును, ప్రజల బాధల నణచుటయె వీరి మొదటి రాజకీయానుభవము.

5. దక్షిణఆఫ్రికాలో వీరు సాగించిన సత్యాగ్రహోద్యమము జయమందినది. అప్పటినుండి దానియందు విశ్వాసము హెచ్చింది.

6. 1919 లో మాంటుఫర్డు సంస్కరణముల ఆందోళన సహాయనిరాకరణోద్యమమునకు అవకాశము కల్గించెను. అప్పుడే మధ్యమతరగతివారందరిచేత ప్రభుత్వములతో సహాయనిరాకరణము జేయించచూచెను.

7. 1921 నుండి మనదేశీయులు వీరినాయకత్వముక్రింద హెచ్చుతున్న, ఆత్మవిశ్వాసమును పొందగల్గిరి.

8. తన విరోధులకు ఆపదలు వచ్చినపుడు వారు తన సహాయముకోరితే వారికి ముందు సహాయ మొనర్చి ఆ పిమ్మట తన అవసరాలు తీర్చుకొనుటకు వారితో లడాయిచెయ్యాలి అంటారు.

9. ఆర్థికముగా వర్గసంరంభము జమీందార్ల, కోటీశ్వరులచేతనే కల్గింపబడుతుందనే సత్యాన్ని సంపూర్ణముగా అంగీకరించినట్లు కన్పడదు. కాని వారిబారినుండి కార్మిక కర్షకులను రక్షించవలయును అని ఒప్పుకుంటారు. అందులకు కార్మికకర్షకుల సంఘబలాన్ని వృద్ధిచేసుకొని జమీందార్ల కోటీశ్వ

కర్షకుల పెత్తనాన్ని సంపాదించుటకై ప్రయత్నించిరి. అచ్చట కుల, మతభేదాలు అంతగాలేవు. ఆర్థికముగా హెచ్చుగా ప్రజలను పీడించుచున్న పెత్తనదార్లను తొలంగించుటయె ఆయనకుగల్గిన పని కనుక ఆయన పంథా ఆర్థికవిప్లవము.

3. వారికి మతమంటె ప్రత్యేకాభిమానము ఎపుడును లేదు. తన అన్నవద్ద ఆర్థికమంత్రాలను గ్రహించెను.

4. 'కార్లమార్క్సు' శిష్యుడైన తన అన్న అలెగ్జాండరుకు ఉరిశిక్షపడగా వానికి ఆనాటినుండియు హృదయతాపము బయలుదేరెను. పూంజీదారుల పెత్తనాన్ని విధ్వంసమొనర్చుటకు పూనుకొనెను.

5. 1905 లో 'పెట్రోగ్రాడ్'లో జరిగిన తిరుగుబాటునందు కార్మిక కర్షకు లుపయోగించిన బల ప్రదర్శనము వారికి ఆపద్ధతియందు విశ్వాసము కల్గించింది.

6. 1905 తిరుగుబాటు బొల్‌షివిక్ పార్టీని ఖచితంగా స్థాపించి క్రమముగా బలపరుచుటకు అవకాశము కల్పించెను.

7. 1905 నుండి కూలీల పెత్తనదార్లకు లెనిన్ యందు నమ్మకము కల్గుచుండెను.

8. అట్లుకాక అట్టిసమయములయందే తమ విరోధులగు జమీందార్లమీద తిరుగబడి జయమందాలి యంటారు. (మన తిలకుగారి తత్వముకూడ ఇదే.)

9. వర్గవిద్వేషాలున్ననూ వాటిని కల్గిస్తున్న కోటీశ్వరులను, జమీందార్లను విప్లవకారులైన ప్రజలు పతనము ఒనర్చాలంటారు. మిగిలిన విషయాల్లో వీరిద్దరికి భేదాభిప్రాయము లేదు.

రులయెడల తమకున్న బానిసత్వపు బుద్ధిని పోగొట్టుకొని తమ బలగాలతో శాసనసభలు, సత్యాగ్రహోద్యమములు ద్వారా అధికారము చేపట్టాలంటారు. ఆపిమ్మట పూంజీదార్ల పెత్తనాన్ని తొలగించడానికి శాసనము చేయవచ్చు అంటారు.

10. వీరికి క్రిస్టియన్ సోషలిస్టు అయిన జాన్ రస్కిన్, ఒక విధమగు నిహిలిష్టుఅయిన టాల్‌స్టాయి కమ్యూనిష్టిక్ యానార్కిష్టిక్ ఆర్థికతత్వాన్ని ప్రసాదించిరి. కనుక ప్రభుత్వమే వద్దంటారు. నిర్బంధాన్ని ప్రయోగించే అధికారము పనికిరాదంటారు. అయినను ప్రజలే పెత్తనముచేయాలంటారు. అన్ని హక్కులనుపొంది పైవారిని తొలగించాలంటారు. హక్కులులేనివారిని ఉద్ధరించాలంటారు. వర్గచైతన్యముయొక్క అవసరాన్ని గమనిస్తారుకాని అది వ్యక్తిగతద్వేషాన్ని పురికొల్పు మార్గమున వృద్ధిపొందరాదంటారు.

11. ఎప్పటికైనను ధనవంతులకు ధర్మబుద్ధిని కలిగించి సంఘముల యెడల వారు నెరపవలసిన ధర్మమును సాగించునట్లు చేయుటకు కార్మిక కర్షకులు తమ యాత్మశక్తిని పెంపొందించుకోవలె నంటారు. అది సాధ్యమవుతుందని యంటారు. అటులకాక బలవంతముమీద పూంజీదార్లను నెట్టితే వారు తిరిగి మొలకలెత్తి సంఘమును విచ్ఛిన్నపరుస్తారు అంటారు.

12. తనసేవకులు పరిశుద్ధవర్తనులై యుండుటే కాక ప్రజలందరికి తమ స్వధర్మాన్ని నెరవేర్చుటకుగాను ధర్మతత్పరతను కల్గించిననే ఆపిమ్మట కల్గు విప్లవము స్థిరపడును,అది ధర్మమైనదగును అంటారు.

13. ఒక అధర్మాన్ని పోగొట్టుటకు మరొక అధర్మము చేయగూడదంటారు. ధర్మకార్యాన్ని అయినా అధర్మకార్యంచేత సాధించకూడదంటారు.

10. మార్క్సుగారి సిద్ధాంతాలే వారికి ప్రామాణ్యము. వర్గచైతన్యాన్ని వృద్ధిపరచాలి. వ్యక్తిగత ద్వేషము వారికి కూడదు. వ్యక్తులను తొలగించినంత మాత్రాన వారికి ఆధారభూతులైన వేరులన్నీ నాటుకుపోయిన వ్యక్తిగత భాగ్యవిభజనపద్ధతి అసాధ్యమని నమ్మిరి. కనుకనే వారును గాంధీజీవలెనే టెర్రరిజంను కూడదన్నారు.

11. ఎప్పటికైనను ధనికుల ధర్మము కోసరమయినా, స్వవినాశమును కోరరు. తుదినిమిషమువరకు హాడలుపెట్టారు కనుక వారి కిష్టములేకున్నను వారిని తొలగింపకతప్పదు, ఆపిమ్మట వారు తిరుగబడి క్రమముగా ప్రజలలో తమ అభివృద్ధికి కారణభూతమైన స్వలాభతత్పరతను పెంపొందునట్లు చేయనీయ కలదు కనుక తగినంత శ్రద్ధతీసుకొనక తప్పదు.

12. ఎల్లరికి అట్టితత్పరత కల్గించుట సాధ్యము కాదు. అందరకు తమ అనుచరులు సాధింపబూనిన పరిమార్పుయొక్క అవసరమును లాభమును తెలియజేసి వారిలో, హెచ్చుమంది సహకారమును కొంతవరకు పొందుటేచాలు.

13. ఒక అధర్మాన్ని ఏవిధముగానైనా తొలగించటానికి ప్రయత్నముచేయుట ధర్మము. ప్రజలను ఎప్పుడైనా, ఏదేశానసైనా, బలవంతముమీదనె లొంగదీసారు పూంజీదార్లు. తిరిగి వారు పైకిరావడము అవసరమయితే ఆ బలవంతమార్గములు అవలంబించుటయె ధర్మమంటారు.

**14.** సాంఘికవాదముయొక్క సాధారణపుసూత్రములు వీరికిని సమ్మతమే.

**14.** ఇట్టి సంస్కరణలు యావత్తు, కార్మిక కర్షక రాజ్యము వచ్చిన తర్వాత సాధించటానికి తయారు. భాషాప్రయుక్త రాష్ట్రములను నెలకొల్పి వివిధపరిశ్రమలను వివిధ రాష్ట్రాలలో నెలకొల్పి నిరుద్యోగము పోగొట్టుట, విద్యుచ్ఛక్తి హెచ్చించి రైతులను రక్షించడానికి, విప్లవానంతరము పూనుకున్నారు.

**15.** 1916 లో బెనారెస్ యూనివర్సిటీ విద్యాలయ ప్రారంభోత్సవమునందు, మహారాజుల కెదురుగా బీదలను నిలవబెట్టి నిరూపించిరి. రెండవ రౌండుటేబిల్ కాన్ఫరెన్సులో కోటీశ్వరుల కెదురుగా భూమిలేని బీదల నిలువబెట్టి వారిసత్వరాభివృద్ధికై ధనికులు తమ కోట్లధనమును కరగింపక తప్పదనిరి. ఖద్దరు గ్రామసౌభాగ్యసంఘములద్వారా నిరుద్యోగులై కడు బీదలైయున్న కోట్లకొలది ప్రజలకు తాత్కాలికముగా కాంగ్రెసువినను సహాయము చేయవలెననియు, వారిని రక్షించుట ప్రభుత్వప్రథమ ధర్మమనియు నిరూపించిరి.

**15.** సాంఘిక పెత్తనముక్రింద మెన్షివిక్‌ను అత్యంతంగా ఉపయోగించి ఎల్లరకు అనుభవించేదానికి, హెచ్చు సౌకర్యాలు కల్గించి, హెచ్చు విశ్రాంతిని సాధ్యపరచి చదువుసంధ్యలను పొందుటకు సంపూర్ణ సౌకర్యాలను కల్గించుటయే, కార్మిక కర్షకుల ప్రభుత్వము వెనువెంటనే చేయవలసిన పని యని నమ్మిరి.

**16.** మెషినుల యుగముద్వారా పూంజీదార్ల యుగము వస్తుందనీ, దానివల్ల వర్గసంరంభము వృద్ధి అవుతుందనీ- కోట్లకొలదిగాఉన్న మనబీదలనందర్ని పూంజీదార్ల పెత్తనానికి ఆహుతిచేయుట న్యాయముకాదు కనుక మెషినుల పెంపకాన్ని ప్రోత్సాహపరచరాదు అంటారు.

**16.** 1905 లో ప్లెఖోనోవ్ ప్రభుత్వము తనమీద తిరుగుబాటుచేసి మెన్షివిక్ పార్టీలో చేరగా తానొక్కడే బోల్షివిక్ పార్టీని నడుపుటకు సిద్ధపడ్డాడు. 1917 లో తనపార్టీ అంతా తిరుగబడేటట్లున్నా తప్పక మెన్షివిక్‌తో సహాయనిరాకరణముచేసి కార్మిక కర్షకుల నియంతృత్వాన్ని బోల్షివిక్ పార్టీద్వారానే స్థిరపరుచవలెనని తీర్మానించి పెత్తనము సాధ్యమైన పిమ్మట కరువువచ్చినా, దేశాంతర్గత విప్లవమువచ్చినా, మధ్యతన్నూ అనేకమార్లు ధనికుల ముఠాదార్లు చంప ప్రయత్నించినా ధైర్యమును వీడక సాంఘికవాదమును అనుభవములో సాధించుటకై మరణించువరకు కృషిచేయుచునె యుండిరి.

**17.** సంపూర్ణంగా విశ్వసించి అవసరమైనదని తలంచిన సంస్కరణాన్ని సాధించటానికి తనవారంరంతా ఎదురైనను పూనుకొనే ధీరుడు. 1930 లో ఉప్పు సత్యాగ్రహోద్యమము అట్లాప్రారంభిం

**17.** 1917 వరకు మతపుపిచ్చియందు, బానిసత్వమునందు, ఆర్థికదాస్యమునందు చిక్కి ఆత్మవిశ్వాసములేక పాశ్చాత్యదేశాల్లోకల్లా అతిదుర్గతియందున్న రష్యను ప్రజలకు ప్రపంచము నందంతటా

చాడు. 1932 లో హరిజనుల రక్షణకై నిరసన వ్రతము అల్లా ప్రారంభించాడు. 1933 వ్యక్తిగత శాసనోల్లంఘనాన్ని అల్లా ఆపుదల చేసాడు. 1934 లో అఖిలభారత గ్రామ పునర్నిర్మాణ సంఘమును ప్రారంభించాడు. ఇపుడు కాంగ్రెస్ నుండి విరమించుకున్నాడు. దేశానికి నూతనచైతన్యాన్ని కల్గించాడు. బానిసత్వమును, అమానుషత్వాన్ని తొలగింపజేసి హరిజనులను తదితరులు సాధారణపౌరులుగా అంగీకరించునట్లు చేశాడు. దేశము ఎల్లెడల జాతీయ సంఘాలు, ఖద్దరు, గ్రామసౌభాగ్య సంఘములను పెట్టించి భారతీయులందరిలోను సంఘబలాన్ని కలుగజేశాడు. జాతీయపాఠశాలలు ద్వారా, క్లుప్త జీవితపద్ధతులద్వారా ప్రజలెల్లరికి కొన్ని సాధారణ జాతీయచిహ్నాలను కల్గించినాడు, మొత్తముమీద కాంగ్రెసు బీదల సంస్థగా మారుటకు వాంఛించినాడు.

నాయకత్వము భావవీధినె కాక, భౌతికవీధియందును కల్గించినారు. మూడవ అంతర్జాతీయకార్మికకర్షక సమ్మేళనమును స్థాపించారు. ప్రపంచమంతటా మార్క్సుగారి సిద్ధాంతములయెడల నూతనగౌరవము, శ్రద్ధ కల్గునట్లు చేసారు.

18. ధనికులకు ఇపుడున్న పెత్తనాన్ని క్రమముగా తగ్గించేందులకు, ఇకముందు పెరుగకుండుటకు ఎ.ఐ.యస్.ఐ.ఎ- ఎ.ఐ.వి.ఐ.ఎ ; లద్వారా దేశీయుల ఆర్థికపరిస్థితులను బాగుచేసి కృతార్థతపొందుట సాధ్యమగునందురు 'గాంధీగారు.'

18. ఇట్టి పునర్నిర్మాణకార్యక్రమముల నన్నిటిని విప్లవానంతరము కడు చులకనగా సాగించవచ్చును అంటారు 'లెనిన్‌గారు.'

# కీ. శే. ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రి

రచయిత :

వేదుల రామశాస్త్రి

సీ. నన్నయకవితాప్రణాళిక కొందఱు
కున్ముఖత్వముగూర్పకుండవచ్చు
తిక్కయజ్వకవిత్వశక్తికి మిక్కిలి
కొందఱు తలతిక్కఁ జెందవచ్చు
ఎఱ్ఱాప్రగడ కవయిత్రృబంధ మానంద
మొకకొందఱకుఁ గూర్పకుండవచ్చు
వేములవాడ కవిత్వపాకము కొంద
ఱోహోయనుచు మెచ్చకుండవచ్చు
అట్టులే వ్యాసమూర్తి శాస్త్ర్యనఘకవిత
తాలుకట్టనమగుచు కొందఱకునరుచి
గూర్పగావచ్చు నంత నక్కోవిదోద్ధు
నాడికకు పాత్రుఁజేయుదు వఱె చెడుకలి.

గీ. కూచిమంచికులాంభోధి కువలయేశుఁ
డైన శ్రీతిమ్మకవిమౌళి యజ్ఞతతికిఁ
బైకి అరసికుఁడట్లు కన్పట్టి కృతుల
యందు రసికావతంసుఁడే యయ్యెఁజుమ్మి.

గీ. అట్టులే వ్యాసమూర్తిశాస్త్ర్యార్యమౌళి
రసికవర్యుఁడలంకృతి రత్నరాశి,
ఆకృతిం బట్టి ఛాందసమంటఁగట్టు
దోటు నీకిట్టు తెల్పి యెట్లాదవె కుకలి.

విజ్ఞానసంపాదనావసరమున వివిధవిషయములందు కలుగు సందేహములను నివారించుకొనన పత్రికాముఖమున జిజ్ఞాస నలుపుటకును— ఇందలి ఏ ఒక్క జిజ్ఞాసకైననుసరే సరియైన సమాధానము తెలిసియున్నచో దానిని కూడినంత సంగ్రహముగ వ్రాసి, ప్రచురణార్థము పంపుటకును ఆంధ్రభూమి పాఠకులను ప్రార్థింతుము. —సంపాదకుడు.

### ౯౧. తద్దినములు పెట్టుట

చనిపోయిన పిత్రాదులు పునర్జన్మనెత్తియేయుందురను నూహతో శ్రాద్ధములు మానుట యుక్తియుక్తమును శాస్త్రీయమును గాదు. ఏలన : (1) ఆయూహ సరియైనది కావచ్చును, కాకపోవచ్చును. కానిచో తప్పుచేసినవారమే యగుదుము. పునర్జన్మయున్నదని చెప్పినంతమాత్రమున చనిపోయిన వెంటనే పునర్జన్మ వచ్చునని తేలదు. అది యెపుడువచ్చునో మన మిచ్చటనుండి యూహింపలేము. అట్టిచో పునర్జన్మ వచ్చియేయున్నదను నిశ్చితాభిప్రాయమును గల్పించుకొని శ్రాద్ధములు మానుట యవివేకము. (2) పిత్రాదులు పునర్జన్మనెత్తియున్నను వారికి శ్రాద్ధములను పెట్టవలసినదే. ఏలన : మనము పెట్టు శ్రాద్ధములు కేవలము పిత్రాదివ్యక్తిగతములైన యాత్మలనుగూర్చి మాత్రమేకాదు. 'పితృదేవత'లను దేవతలుగలరు. వీరే వసు రుద్రాదిత్య గణములు. పిత వసురూపుడు. పితామహుడు రుద్రరూపుడు. ప్రపితామహుడు ఆదిత్యరూపుడు. శ్రాద్ధములలో పితృ పితామహ ప్రపితామహు లీరూపాలలోనే యాహ్వానింపబడుచున్నారు. పితృ పితామహ ప్రపితామహులు పునర్జన్మనెత్తియేయున్నను శ్రాద్ధదత్తములగు పిండాదులు వసు రుద్రాదిత్య గణములకు ముట్టును. వారు తద్ద్వారమున పునర్జన్మనెత్తిన పిత్రాదులకు తృప్తిని గల్గించుచుందురు. ఏదోవిధమున వారికి సుఖమును గల్గించుచుందురు. (3) పిత్రాదులకు శ్రాద్ధములను పెట్టుట కేవలము వారినుద్ధరించుటకే కాదు. అది కర్తకు కూడ శ్రేయోదాయకమే యగుచున్నది. ఇచట నొక వైదికభావమును గుర్తింపవలసియున్నది. జీవాత్మ రెండుభాగములుగ నున్నదని తైత్తిరీయారణ్యకము చెప్పుచున్నది. ఒకటి సంతానరూపమున నిచట నుండుననియు, రెండవభాగము పరలోకములోను నుత్తరజన్మలలోను విహరించుచుండుననియు నచట చెప్పబడియున్నది. కావున పిత్రాదులకు బెట్టబడిన శాద్ధములవలని తృప్తి యేదోయొక యనిర్వాచ్య రూపమున కర్తయొక్క యాత్మకుగూడ గల్గుచుండును.

—జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.

### ౯౨. బ్రహ్మశ్రీ ఎవరికి చెల్లును?

బ్రహ్మశ్రీ యను బిరుదము ఏజాతివారికి జెల్లును? ఈవరలో ప్రాచీనమునుండియు బ్రహ్మశ్రీయను పదము బ్రాహ్మణకులమువారికి ఉపయోగించుచుండ ప్రకృత మన్నిజాతులవారు పైశబ్దమును బిరుదముగా ఉపయోగించుకొనుచున్నారు. బ్రహ్మశ్రీయను పదమునకు సరియైన అర్థమేమి? అన్నిజాతులవారి కుపయోగించుకొనుటకు శాస్త్రప్రమాణములుగలవా? శర్మ, వర్మ, గుప్త, దాస శబ్దము లన్నిజాతులవా రుపయోగించుకొనుట కర్హులా? ఒకశబ్దమున కొకజాతివారే అర్హులా? బ్రహ్మశ్రీ శబ్దము పైశబ్దములవలె జాతి ప్రవృత్తినిమిత్తకమా, కాదా?

—బి. వి. ఆర్. శర్మ.

### ౯౩. సి. కె. నాయని పూర్తి పేరు

సుప్రసిద్ధ క్రికెటు యోధుడగు మేజరు సి. కే. నాయుడు ఆంధ్రుడందురు. అది నిజమేనా? అట్లయిన అతని పూర్తిపేరేమి?

—పరాంకుశం నారాయణమూర్తి.



# తారాపరిచయము



# పసుపులేటి కన్నాంబ

[కనుసైగలచే కాలేజీ విద్యార్థుల మనస్సులను ఉద్రేకపఱుస్తుంది రామతిలకం.

శృంగారించుకొని ఇతరుల రంజింప ప్రయత్నిస్తుంది శ్రీరంజని.

మరి పసుపులేటి కన్నాంబో?]


రచయిత:

లక్ష్మీనారాయణపాణిగ్రాహి


ప్రస్తుత ఆంధ్రనాట్యరంగమందు అభినయించు నటీమణులలో ప్రథమశ్రేణికి జెందినది పసుపులేటి కన్నాంబ. ఈమె కళావంతుల సంఘమునందు పుట్టి పెరిగిన నట్టువరాలు. ఈమె జీవితమునందలి తొలిదినములు నాట్యరంగముపై చూచి ఆనందించు భాగ్యం ఆంధ్రులకు లభించదాయె. ఈమె నాట్యకళోపాసనమునకు గడంగి ఎన్నియో ఏండ్లుగాలేదు. అప్పటికే ఆమె ప్రాయపుపొద్దు మించిపోయియుండెను. లేనిచో హిందుస్థానీ సినీమాతారలను తలదన్ని అఖిల భారత నాట్యకోవిదుల మన్ననలను బడసియుండనోపు. ఈమెమూలమున ఆంధ్రకళాలక్ష్మికి కొంత లోటుతీరినదని చెప్పవచ్చు.

ఈమె ఆంధ్రనాట్యకళాలక్ష్మికి సంగీతసాహిత్య నీరాంజనములను సమర్పించి ధన్యురాలైనది. ఈమె సహజసుందరి. దేహకాంతి పండుతమలపాకువలె పసిమివర్ణముగలిగియుండును. వదనము చంద్రబింబముమాడ్కి చల్లని కరుణారసామృతమును వెదజల్లుచుండును. ఈముద్దరాలి పరిచయభాగ్యమునకై ఆశించనివారుండరు. ఈజవ్వని వయఃపరిమాణము కొంతవరకు లలితకళాప్రవేశమునకు అడ్డుపడెను. ఈమె వేషభూషణములు పాశ్చాత్యనాగరికతలతో విరగబడక సాధ్యమైనంతవరకు హైందవ సాంప్రదాయములను అనుకరించియుండును.

ఆగర్భ శ్రీమంతురాలగు ముత్తైదువట్లు పెండ్లికి పిలువవచ్చిన పేరంటరాలివలె అలంకరించుకొని నాట్యాభినయమునకు గడంగును. ఈ కుసుమకోమలగాత్రి తనమృదుమధుర గానరసామృతముచే ప్రేక్షకుల తన్మయులుగా జేయుచుండును.

ఈమెరాగము కోకిలగానమును పోలియుండును. ఈమెపాటయందలి స్థాయి హాయి యనిపించుచుండును. ఈమెసంగీతసరణిలోనున్న మాధుర్యము, లాలిత్యము ఇంకొక ఆంధ్రనటీమణియందు వినబోము. తన గానసైపుణ్యముచే ఎదుటివారి హృదయవీణాతంత్రుల మీటుశక్తి ఈమెకు అపారము. ఈమె గానాభినయములు కళాసంపదలతో భావగర్భితములైయుండును.

ఈమె నటించిన పౌరాణికఫిల్ములు టాకీలన్నిటిలో తలమానికముగా నెన్నబడుచున్నవి. ఈమె పాత్రపోషణము కడు సమర్థతతో నిర్వహించినట్లు నిరూపించును. నటనాకౌశలముకూడ మెండు. ఐనను పూర్తిగా ఒడుదుడుకులు లేవని చెప్ప సాహసించలేము. సమయోచితములగు అభినయములచే వాటిని కప్పిపుచ్చుటకు ప్రయత్నించుచుండును. స్ఫురద్రూపియగు విమర్శకుని దృష్టికే యట్టిలోపములు గోచరమగుచుండును. జనబాహుళ్యము వాటిని గుర్తించలేదు. సరస్వతీటాకీసువారి "ద్రౌపదీవస్త్రాపహరణము" నందలి "ద్రౌపది" పాత్ర పామరుల ఆమోదమును బడసెను. కళాకోవిదులకు అసహ్యము కలిగించెను. స్టారుకంబైన్సువారి "సత్యహరిశ్చంద్ర" యందలి "చంద్రమతి" పాటకజనముచే పాడు యనిపించుకొనెను. విమర్శకులచే "బలే" యని తలలూపించుకొనెను.

కళావతియైనను శృంగారరసము చిల్కరించుట యీమెచేతకాదు. భక్తిరసపోషణమే యీమెకు వెన్నంటినదిగా నున్నది. ఈమె ఆపదలయందుచూపు ధైర్యస్థయిర్యసాహసములును, భాగ్యభోగములయందు గనబరచు హావభావహేలాలీలావిలాసములును చూపరులను ముగ్ధులనుగా జేయుచుండును. ఈసుందరవిగ్రహము ముందరనున్నప్పుడు దుఃఖము దూరమగును. ఉత్తేజమగు భావములు కలుగజేయును. కవియైనచో కలమునకు పనిజూపును.

ఈమె రామతిలకంవలె కనుసైగలచే కాలేజీ విద్యార్థుల మనస్సులను ఉద్రేకపఱచునదికాదు. శ్రీరంజనివలె శృంగారించుకొని యితరుల రంజింప ప్రయత్నించదు. ఈమె ఆట, పాట, మాటలన్నియు స్వాభావసిద్ధములే.

# మగవాడికి యేడాదికి నూర్గురు పిల్లలు—
# —తొంభైఐదో యేటకూడ గర్భాదానశక్తి

రచయిత:

జి. వెంకటరావు, బి. ఎ.

పదిహేనుసంవత్సరాలు నిండకపూర్వమే మగవాడు గర్భాదానం చెయ్యడానికి సమర్థుడు అవుతాడు. అతిబాల్యవివాహాలు ప్రబలి ఉన్న మనదేశంలో పదిహేనుఏళ్ళకే సంతానవంతులైన మగవారు అరుదుకాదు. అట్టివారు పాశ్చాత్యదేశాలందునూ విరివిగా వున్నారు. వుండబట్టే కామశాస్త్రగ్రంథాలు వ్రాసిన పాశ్చాత్యులు మగవానికి పదిహేను ఏళ్లు నిండకుండానే గర్భాదానశక్తి కలుగుతుందని నొక్కి వక్కాణించుచున్నారు. పదిహేనుఏళ్లు నిండకుండానే మగవానికి కలిగే సంతానోత్పాదకశక్తి అతని జీవితకాలంలో ఎంతకాలంవరకు వుంటుంది అనే ప్రశ్న కలగడం సహజం. ఆప్రశ్నకు శాస్త్రవేత్తలు ఏమి సమాధానం చెపుతున్నారంటే చచ్చిపోయేవరకు మగవానికి సంతానోత్పాదకశక్తి వుంటూనేవుంటుందని. ఆడదానికిముట్లు ఉడగడంతోటే సంతానోత్పాదకశక్తి సమసిపోతుంది అనుకోవచ్చు. మగవాని సంతానోత్పాదకశక్తి అట్లా సమసిపోయే నిర్దిష్టకాలము ఏమిన్నీ లేదు. సాధారణంగా అరవయ్యోపడి మొదలు మగవాని సంతానోత్పాదకశక్తి క్రమంగా క్షీణించడానికి ఆరంభిస్తుందని శాస్త్రకారుల అభిప్రాయమై ఉన్నది. ఈ అభిప్రాయం నిశ్చింతగా నమ్మతగిందికాదనడానికి తగిన వినాయింపులు శాస్త్రపరిశోధకులకు కుప్పతెప్పలుగా దొరుకుతూవుంటాయి. ఫార్బ్రైక్ అను శాస్త్రవేత్త 'స్టైరిలిటీ ఇన్ వుమన్' అను తన గ్రంథంలో తొంభై ఐదు ఏళ్ళ పండుముసలి వీర్యానికికూడా సంతానోత్పాదకశక్తి వుండడం పరిశోధనవల్ల రూఢమైందని స్పష్టంగా వ్రాసివున్నాడు. కాన్సరు రోగంవంటి పెద్దరోగం, క్షయరోగంవంటి ప్రబలజాడ్యం ప్రమాదస్థితికి వచ్చియున్నతరుణాల్లోకూడా మగవాడు సంతానోత్పాదనం చేయగలిగి ఉండడం శాస్త్రపరిశోధకులకు అనుభవపునరుక్తమైన విషయం. అదిన్నీగాక మగవాడు ఏడాదికి శతాధికస్త్రీలతో రమించి వారియందు సంతానోత్పాదనం చేయగలిగి వుంటాడని శాస్త్రవేత్తలు చాటుతున్నారు. గర్భాదానశక్తిని పదిహేను ఏళ్లు నిండకుండానే పొంది తొంభైఅయిదేళ్లు నిండినా కోల్పోక మగవాడు అవకాశంవుంటే ఏడాదికి నూర్గురకు పైబడిన స్త్రీలయందు నూర్గురకు పైబడిన పిల్లలను పుట్టింపగలడని శాస్త్రజ్ఞులచే రూఢముచేయబడింది. కాని అనుభవంలో ఎక్కడా ఇది ఇంతవరకు జరిగియుండలేదని ఒప్పుకుని తీరాలి.

మగవాడి సంతానోత్పాదనశక్తి ఇట్టిదిగావుంది. ఇక స్త్రీల సంతానోత్పాదనశక్తి

ఎట్టిదిగావుందో కూడా విచారిద్దాము. స్త్రీలకు సంతానోత్పాదనశక్తి సాధారణంగా పండ్రెండు పదునాలుగు సంవత్సరాలలో ప్రారంభంఅవుతుంది. నలభై అయిదేళ్లు నిండేసరికి స్త్రీలకు ఆశక్తి ఉడిగిపోతుంది. ఒక స్త్రీకి ఆమె జీవితకాలం అంతటిలోను పదిహేను ఏళ్ళకి పైబడి నలభై అయిదు ఏళ్ళకు లోబడిన ముప్ఫయిఅయిదు సంపత్సరాల కాలమే సంతానోత్పాదనశక్తి వుంటుంది. ఏ స్త్రీకూడా ఏడాదికి ఒక కాన్పుకంటె హెచ్చు కాన్పులు కాంచలేదు. అందుచేత- కవలపిల్లల్ని కంటేతప్ప- ఏడాదికి ఒకపిల్లనికంటె స్త్రీ ఎక్కువ ఉత్పాదించలేదన్నమాట. ఈ కారణం చేత ఒకానొక స్త్రీ పదిహేనోయేట వివాహితఅయి సంతానోత్పాదనకు ప్రారంభిస్తే ముట్లు ఉడిగేలోపుగా ఏడాదికి ఒకపిల్ల చొప్పున ఇరువయిఐదు మొదలు ముప్ఫయిమంది వరకు పిల్లల్ని కనడానికి అవకాశంవుంది. అట్టి ఆమె ఆరోగ్యవతి, సంతానోత్పాదనశక్తిని చెడగొట్టుకోనిది అయివుండాలి. ఇంతకూ తేలిన సారాంశం ఏమిటంటే ఒకానొక స్త్రీ యొక్క సంతానోత్పాదకశక్తి ముప్పది యేళ్ళకు మాత్రం నియమితమై ఉంటుందని. ముట్లుఉడిగిన తరువాతకూడా ఒక్కొక్కప్పుడు స్త్రీలు గర్భంఫరించడం కద్దు. ఇరవై ఎనిమిదిరోజులకొకసారి చొప్పున ఏడాదికి సుమారు పదమూడుసారులు ఒక స్త్రీ ఋతుమతిఅయి గర్భాదానానికి యోగ్యురాలు అవుతుంది. సిద్ధాంతప్రకారం ప్రతిస్త్రీ తన జీవితకాలంలో ముప్ఫయిమంది పిల్లల్ని (కవల పిల్లలు కాకుండావుంటే) కనడానికి అవకాశం వుంది. అయితే ఇంతమంది పిల్లల్ని కన్నస్త్రీ ప్రపంచంలో ఇంతవరకు ఎవరేనా ఉన్నారా అంటే దానికి సమాధానం నిదర్శనపూర్వకంగా ఎవరూ చెప్పలేక పోతున్నారు.

సిద్ధాంతంప్రకారం మగవాడు ఏడాదికి నూర్గురు పిల్లల్ని పుట్టించగలడు; స్త్రీ తన జీవితకాలంలో ముప్ఫయిమంది పిల్లల్ని కనగలదు. అదిన్నీకాక కొన్ని జంతువులలోవలె స్త్రీపురుషులలో ఎదకాలం అనేది ఒకటి ప్రత్యేకించిలేదు. స్త్రీపురుషులు సంవత్సరంలో ఎప్పుడైనాసరే సంతానోత్పాదనకు సమర్థులై ఉంటారు. కొన్నికొన్ని జంతువులికి కొన్నికొన్ని ఎదకాలాలు ప్రకృతి సిద్ధములయి వుంటాయి: అవి ఆ ఎదకాలాల్లోతప్ప ఇతరసమయాల్లో సంతానోత్పాదనకు అసమర్థాలు అయివుంటాయి. ఏడాదిలో కొన్నికొన్ని ఋతువులు కొన్నికొన్ని జంతువుల సంతానోత్పాదనకు ప్రత్యేకింపబడి వున్నట్లు కనిపిస్తుంది. ధ్రువమండలములచెంత నివసించే ఎలుగుబంట్లు ఒక్కనడి శీతాకాలంలో మాత్రమే పుడతాయి. కాలిఫోర్నియా సముద్రసింహాములు ప్రతి సంవత్సరమూ జూన్ పదిహేనవ తేదీ మొదలు జూలై పదిహేనవ తేదీ వరకుగల నెలరోజుల్లో మాత్రమే ప్రపంచం మీద పుట్టువుగంటాయి. ధ్రువమండలపు ఎలుగుబంటి ఈయేటి ఎదకాలంలో తన జంటదానితో సంగమించక పోయినా, సంగమించినప్పటికీ గర్భధారణ జరక్కపోయినా తిరిగి మరుసటి సంవత్సరంలో ఎదకాలం వచ్చేవరకూ అది తిరిగి గర్భంధరించలేదు. ఆజంతువుల సంతానోత్పాదనశక్తికి ఈ కాలనియమం ఒక ప్రబల ప్రతిరోధం అయినవిషయం. మానవులవిషయంలో ఇట్టికాలనియమసంబంధమైన ప్రతిరోధం ఏమిన్నీ లేదు. స్త్రీలు సంవత్సరంలో ఎప్పుడైనా గర్భంధరించడానికి సమర్థులు అయివుంటారు. కొన్నికొన్ని జంతువుల్లోవలె జన్మదినాలు మానవుల్లో సమగ్రజాతికి చెంది

నవికావు. మానవుల్లో జన్మదినాలు జాతికి చెందినవి కాక వ్యక్తులకు సంబంధించియున్నవి.

సిద్ధాంతం ఇటుల మానవుని సంతానోత్పాదనశక్తిని రూపిస్తూవున్నది. కాని ఏమగవాడున్నూ ఏడాదికి నూర్గురు పిల్లల్ని పుట్టించివుండలేదు; ఏస్త్రీయున్నూ తన జీవితకాలంలో ముప్ఫయిమంది పిల్లల్ని కనివుండలేదు. మానవుల విషయంలో సంతానోత్పాదనానికి కాలం ఒక ప్రతిరోధంగాకూడా వుండలేదు. అయినా మానవులు పుట్టించగలంతమంది పిల్లల్ని పుట్టించలేక పోతున్నారు. దీనికి కారణం యేమిటి?

జన్మనిగ్రహసాధనాలు యేవోకొన్ని మనకు తెలియకయే మానవప్రకృతియందు గర్భితమై ఉండడమే.

ఆసాధనాలు యేమిటో?

---

# తెలుగు తారల తీరులు

రిహార్సల్సులో తన పాతాలువదలి యితరులకు బోధించాలని ప్రయత్నిస్తాడు యడవల్లి.

... ... ...

ముక్కుతుడుచుకునే గుడ్డ, పొడుంబుర్ర ఉంటేనేతప్ప 'మైకు' ముందుకురావటానికి వెరుస్తాడు సి. యస్. ఆర్.

... ... ...

షూటింగ్ రోజున మజ్జిగఅన్నం ముద్దలు తప్ప మరేమీముట్టడు వేమూరు గగ్గయ్య.

... ... ...

జుట్టు విరియబోయాలంటే విగ్గు పెట్టుకోంటుంది పాతరూకల రామతిలకం.

... ... ...

గొంతు విప్పేసమయానికి కారాకిల్లీ బనాయిస్తాడు చొప్పల్లి భాగవతార్.

... ... ...

బజారుకు వెళ్లిగాని స్టూడియోకు రాడు షూటింగ్ రోజున సూరిబాబు.

... ... ...

షూటింగ్ రోజుకు ఒకదినం అటుయిటూ తలంటుకోదు కన్నాంబ.

... ... ...

నలుగురనుచేర్చి రహస్యాలన్నట్టు అవీ యివీ చెప్పుతుంటాడు మాధవపెద్ది.

... ... ...

వేషంమీదకూడా బ్రాహ్మణత్వం నిలబెట్టుకుంటాడు ఘంటసాల రాధాకృష్ణయ్య.

... ... ...

తనకు పిలుపువచ్చేవరకు ఒక మూల ఒదిగి ఉంటాడు పారేపల్లి సుబ్బారావు.

... ... ...

తానేవేషంవేసినా నాగుమణి హార్మోనియం వాయిస్తే బాగుంటుందని వాదిస్తుంది శ్రీరంజని.

... ... ...

వేషంవేసుకున్న తరువాత ఆకలి ఎక్కువ నాగరాజరావుకు.

... ... ...

వేషంవేసుకునేటప్పుడు తామసం ఎక్కువ దొమ్మేటికి.

—'ప్రజామిత్ర'లో ఒక మిత్రుడు.

# కారపుకనగలు

గతమాసపు కారపుకనగల్లో అస్ఖలిత యోగనిర్మాతలగు కె. పి. యస్. యమ్ గారి పుట్టుపూర్వోత్తరాలను ఎవరేనా చెప్పగలిగితే వానిని ఆంధ్రభూమిలో ప్రచురింపజేతునని వ్రాసిఉన్నాను. దానిపై పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరునుంచి ఒకరు ఈ క్రిందివిషయములను తెలుపుచున్నారు. వారికోరికపై వారినామము గుప్తముగా ఉంచుచు వారిలేఖను దిగువను ప్రచురించుచున్నాను.

"అస్ఖలితయోగనిర్మాతలగు మహాయోగి గారి పుట్టుపూర్వోత్తరాలు: కృష్ణాపత్రికలో వరుసని రెండేళ్ళనుంచి ప్రచురింపబడుతూ యున్న యీ ఎడ్వర్టయిజుమెంటు చూస్తూ నేయున్నాను, మామ్మామయ్య పత్రిక తెప్పిస్తూండడంచేత. అగస్టు ఆంధ్రభూమిలో మామిత్రులు శ్రీయుత వి. విశ్వనాథంగారు యీఅస్ఖలిత యోగోపదేశికులగు దొంగయోగిగారి యోగరహస్యాన్ని వెల్లడిచేస్తూ ప్రజలు తిరిగిమోసపోకుండా తగిన వేకప్ చేశారు. తిరిగి ఆ కె. పి. యస్. యమ్ దొంగ యోగిగారి అసలునామధేయంతో యీ ఆంధ్రభూమిలో సంపూర్ణంగా వ్యక్తీకరించమనుటచేతనున్ను నా అభిప్రాయంకూడా అదేఅగుటచేతనున్ను శ్రమ అనకుండ యీపనికి నేను పూనుకున్నాను.—యోగి—యోగిగారి స్వగ్రామం పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు తాలూకా, తాళ్ళపూడి. వీరు వైశ్యులు. కంకిపాటి శరభయ్యగారి కొడుకు. సత్యంఅని గ్రామంలో వ్యవహరింపబడుతూ వుంటాడు. ముప్పదిఅయిదు సంవత్సరాలుంటాయి. బక్కపలుచగా నల్లగా వుంటాడు యోగావతంసుడు. జన్మతః కోమటిఅయినప్పటికీ చూచినవారు యోగిని కంసాలి అనుకోకమానరు. ఆయోగికి నాలుగయిదు సంవత్సరాలనుండి మతిస్థిరత తగ్గి వేదాంతసౌధానికి మెట్లు కడుతూవుండేవాడు. ప్రస్తుతం పిచ్చిధోరణి తగ్గినా వటవట వాగటంమాత్రం పోలేదు. మొన్న యీమధ్య నేను వాళ్లింటికివెళ్లి నాకొకప్రతి యిమ్మంటే, పుస్తకాలు అచ్చవుతున్నాయి 72 పేజీల గ్రంథం మీరు ఎప్పుడుఅడిగినా పోస్టుద్వారా అడగండి గాని మాయింటికి పెర్సనల్ గా రావద్దని బ్రతిమాలాడు. మీరట్లాచేస్తే ప్రతి 0-8-0 కి అయినా యిస్తానని ప్రామిస్ చేశాడు. అదిమొదలు ఎక్కడ కనపడ్డా కాన్ఫిడెన్షియల్ అని హెచ్చరించి బ్రతిమాల్తూవుండేవాడు. అప్పటినుండి నేను ప్రచురింపకపోవుటకు కారణం యోగరహస్యం తెలుసుకునే వ్రాద్దామని. యోగిగారి చిరునామా—యోగిగారు తాళ్ళపూడి గ్రామస్థులై రఘుదేవపురం అని చిరునామాలో వుదహరించడం వింతగా కనపడొచ్చు. కోమటిబిడ్డఅయి వుండుటచేతను, భగవంతుడు వాళ్ళకదొరకంబుర యిచ్చివుండుటచేతను (అంటే ఆకార వికారాలుకావు) కె. పి. యస్. యమ్ గారు చిరునామాను బాగా ఆలోచించే రఘుదేవపురం అని యిచ్చారు. కారణంఏమిటంటే తాళ్లపూడిలో అందరూ తనను ఎరుగుదురుకాబట్టిన్నీ, తన బుద్ధివిశేష మానసికస్థిరత్వం విశదమే అవటంచేతను, యోగం మహాయోగం కాబట్టిన్ని, తనవాళ్ళు గ్రామస్థులుకూడా తనతో అసహాయోగంచేసి అల్లరిపెడతారనేభయం మిక్కుటంగావుంది. యింక శీతానగరానికి యిద్దామంటే అతని మేనమామగారియూరు, అత్తవారియూరుకూడా అదే అవటంచేత యోగి తనకు బ్రహ్మరథంతప్పదని గ్రహించేవుంటాడు. అదియుగాక శీతానగరానికికొద్దిరోజులలో ప్రస్తుతపుపోస్టుమేష్టరుగాక యింకొకడు ఆక్టేససైనవాడు రాడనికూడా ఆలోచించివుంటాడు. శీతానగరానికి దగ్గరగా రఘుదేవపురంవున్నది. ఆపోస్టుమేష్టరుతో యోగి ఏదేనియొక ఏర్పాటుచేసుకుని తనవుత్తరాలు తాళ్ళపూడిపంపించే నిబంధన చేసుకున్నాడు. అంటే రోజూ తాళ్ళపూడినుంచి తపాతీసుకువచ్చి తీసుకుపోయే టపారన్నరు ద్వారా. యిదికాక మనము యోగిగారికి సానుభూతి

తెలపాలి. ఏమంటే అడ్వర్టయిజుమెంటుఫీజుతో సహా మోడల్ను యోగి ప్రచురణార్థమై అమృతబజారు పత్రికకు పంపినాడట. వారు యిల్లాంటి ప్రచురణాలు మేము వేసుకోమని చాలాతిప్పలుపెట్టి డబ్బు తిరిగి పంపారట. యోగి పొరపాటుచేశాడు. ఏమంటే మన కృష్ణాపత్రిక వుండగా అమృతబజారుపత్రిక ఎందుకో.

ఇట్లు,
శీఘ్రస్ఖలితుడు."

... ... ...

మా గంజాంమిత్రు లొకరు ఇట్లు వ్రాస్తున్నారు :

"మానసంరక్షణాలు—

—వస్త్రాపహరణాలు.

లక్ష్మీఫిలిం కంపెనీవారి సురభికమల మానసంరక్షణమును, సరస్వతీ టాకీస్ వారి కన్నాంబ వస్త్రాపహరణమును, సాగర్ మూవీటోన్ వారి భారతం (హిందీ) ఫిలుంనందలి జుబేడా వస్త్రాపహరణమును ఒకటినిమించి మరొకటి అత్యద్భుతముగా తయారు కాబడి, ఒక్కొక్కరు ఒక్కొక్కరీతిని తమతమశక్తి సామర్థ్యముల ననుసరించి మానములు కాపాడుకొనిరి. కాని ఇదే మూవీటోనో, కార్పొరేషనో, ఫిలింప్రొడక్షనో, సినెటోనో, టాకీసో తెలియదుగాని, రాఘవాచారిగారి మానసంరక్షణగూడా యిటీవలనే బరంపురం సినీమాహాలులో ప్రదర్శించినటుల ఆసిటీగోడలమీద బిక్కచచ్చి గట్టిగా అంటుకుపోయిన వాల్ పోస్టరులమూలంగా ఏదో పనిమీదవెళ్ళిన నేను చూడ్డం తటస్థించింది. నిజం ఆలోచిస్తే కమల మానసంరక్షణ అనడంమానేసి వీరి మానసంరక్షణ అంటేనే బాగుంటుందనుకున్నారు గాబోలు! లేక కమలమానసంరక్షణ కష్టమని యిష్టపడక, తేలికేమో అని భ్రమపడి రాఘవాచారిగారిదే ప్రదర్శించ దలచారో.—"

... ... ...

పింగళిసూరన్నగారి కళాపూర్ణోదయాన్నిగూర్చి ఇదివఱకే తెలుగులో చాలా విమర్శనలు బయలుదేరాయి. ఆకావ్యం ఇంతవఱకు అనేకదృష్టులతో విమర్శింపబడ్డది. అగుటచే ఇంక ఆకావ్యం విషయంలో విమర్శకదృష్టితో చెప్పతగ్గ కొత్త విషయాలు ఏమీలేవని నేను నమ్మాను. నేనేకాదు ఆంధ్రసారస్వతంలో అభినివేశంకల నామిత్రులుకూడా చాలామంది అదే నమ్మకంతోవున్నారు. ఇటీవల ఈ పత్రికాసంపాదకులతో నేను సంభాషించుచుండగా వారిమిత్రులగు శ్రీదేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు కళాపూర్ణోదయంలో ఆంధ్రభోజుడగు శ్రీకృష్ణదేవరాయల చరిత్ర గర్భితమైవుందని నిరూపిస్తూ ఒక వ్యాసంవ్రాయబోతున్నారని చెప్పేరు. ఆంధ్రప్రబంధాలకు తలమానికమైన కళాపూర్ణోదయంలో ఆంధ్రరాజులకు తలమానికమైన శ్రీకృష్ణదేవరాయల చరిత్ర గర్భితం అయివుందని తెలిసికోడానికి చాలా అద్భుతంగా వుండక మానదు. శ్రీరెడ్డిగారు సాధ్యమైనంత తొందరలో ఆ అద్భుతవ్యాసం ప్రచురించి ఆంధ్రసారస్వతలోకాన్ని ఆశ్చర్యచకితంగా చేస్తారని నమ్ముతున్నాను.

... ... ...

నాగరికత ప్రబలడంతో దొంగతనం పద్ధతుల్లోకూడా నాజూకు బలుస్తుంది. యోగంపేరిట జరిగే ఒక నాజూకు దొంగతనాన్నిగురించి గతమాసం వ్రాసివున్నాను. యాగంపేరిట జరిగే ఒక నాజూకు దొంగతనాన్ని గూర్చి 'భారతీయవైశ్య' పత్రిక ఇట్లా ప్రకటిస్తోంది : 'తిరుమలగిరి బజారు పురోహితుడగు పన్నాల సూరయ్యగారు మహారుద్రమను యాగమును చేయదలచి రూ. 20,000 లు కావలెనని యిల్లిల్లు తిరుగుచు అమాయకప్రజలను భ్రమింపజేయుచు యాగమువల్ల వచ్చు పుణ్య మింతింతగాదని లేనిమహిమలు కల్పించి బోధించుచు డబ్బువసూలు చేయుచున్నాడు. ఈసూరయ్యగారు పురోహితుడైయుండియు వర్తకునివలె తామరపుష్పము మార్కుగల మాచీసుఫ్యాక్టరీ ఆముదంగిర్నీలు, చిల్లరదుకాణములు, దుర్జేవులు మొదలగు వ్యవహారములందు తనస్వంతడబ్బును గోల్పోయి ప్రస్తుతము రుద్రయాగములో దిగినాడు.'

—వి. విశ్వనాధము, బి.ఏ,




# పాత పాటలు

1. పిండికొడదామాక్క బండెక్కుదామా?
రాజమండ్రీ వెళదాము రావే చెల్లెలా!
రాజమండ్రీ పట్నాన మనకెవ్వరక్క?
మన అమ్మతమ్ములు మనకు మామల్లు.
ఎంతచక్కనిదక్క ఈ ఊరికోట
ఎక్కికూర్చున్నారు వెలమదొర్లంత.
ఎంత అందమ్మక్క ఈఊరికోట
కలిసికూర్చున్నారు కరణాలందారు.
చుట్టూను ప్రాకారం చూడుమాఅక్క
రాజరాజు కట్టించె రత్నాంగిమేడ.

2. కలిగినవారు పేదవారు వియ్యమందితే
అరచేతి బెల్లమ్ము చిరిచేదులాయె.
మా వెంకు మామయ్య వియ్యమందితే
పానకం పన్నీరు కలిసినట్టుండె.

3. దొడ్డిచుట్టూ రెండు దిడ్డిగంతల్లు
నెడ్డిదివాణమ్ము నేపుట్టినిల్లు
మేడచుట్టు రెండు మేటిస్తంభాలు
మేనమామ దివాణంబు అమ్మపుట్టిల్లు
మేనమామల్లార! మేటిదొరలార!
అమ్మఉన్నవాడలకు తమ్ములై రండి.
అయ్యఉన్న వాడలకు బావలై రండి.
మేమున్న వాడలకు మామలై రండి.

4. వివరంబుగోరిన వేమగిరి మాది
మానికమువంటిది మాది చత్రమ్ము
మన్నెరాజు వంటివాడు మామ గురయ్య
అందాల పసినిమ్మ అత్త మంగమ్మ.

5. ఆరడి చెయ్యకు అత్తయ్య నీవు
వత్తులు వత్తకు వత్తిగిలి యుండు.
నల్లులకుంపటి నాకెత్తు అత్త!
నిప్పుల కుంపటి నీవెత్తుకొమ్మ.
అత్తగారన్నది తాపెద్దమనిషి
కోడలికి దుడ్డెత్తి తాగెడ్డతినెను.
గెడ్డతిని అత్తగారు గెడ్డపాలాయెను
దుడ్డుతిన్న కోడలు దుడ్డల్లెఉంది.

6. నిమ్మపండువంటిది అమ్మ నా ఒళ్ళు
నీలిరవికె లంపు అన్నల్లచేత
తోటి కోడలవమ్మ దొరబిడ్డవమ్మ
నీవున్న కొవ్వార్లో నిప్పట్టదమ్మ
బావ గురవయ్య బంట్రోతువయ్య
నీవున్న సభలోన మగవారుండరు.
బావగార్లమీద భక్తిగలవారు
దండిగ సభలోన పిండిగొట్టారు.

—నేదునూరి గంగాధరము

# పంజాబ్ బ్లాక్ హోల్

రచయిత:

కొర్రపాటి హయగ్రీవరావు పంతులు

[ఇది 1857-వ సంవత్సరమున జరిగిన విప్లవమునందలి ఒక విశేషము. ఆంగ్లేయపటాలములోని హిందూసిపాయిలు బలవన్మరణము నొందుటకు కారకులైన కూపరుగారు తమ గ్రంథము (దిక్రైసిస్ ఇన్ ది పంజాబ్ బై (ఫ్రెడరిక్ కూపర్)నందు పై విప్లవమునుగురించి పూర్తిగా వర్ణించిరి. ఇదిగాక శ్రీయుత సుందర్‌లాల్‌గారు 'భారతదేశమున ఆంగ్లేయుల పరిపాలన' అను గ్రంథమును వ్రాయుచూ, పై విప్లవమును గురించికూడా పేర్కొనిరి. పైవిషయమును బలపరుచుచూ, శ్రీసుందరలాల్‌గారి మిత్రుడును "ఫుల్వారీ" పత్రికా సంపాదకులునూ అగు హీరాసింహాజీగారు అజనాలాకు వెళ్ళి పరిశోధించిరి. అజనాలాలో 71 సంవత్సరముల వయస్సుగల వృద్ధుడగు బాబాజగత్సింహు అనువాడు పైవిప్లవము జరుగుసమయమున 30 సంవత్సరముల వయస్సుగలవాడైయుండెను. బాబాజగత్సింహుకూడా పైవిప్లవమును కళ్లారా గాంచినవాడగుటచే విప్లవముగురించి ఒక గ్రంథమును వ్రాసెను. హీరాసింహాజీగారు అజనాలాకు వెళ్ళినప్పుడు బాబాజగత్సింహుని కలసికొని పైవిప్లవమునుగురించి పూర్తి విషయములు తెలుసుకొనిరి. శ్రీసుందరలాల్‌గారు వ్రాసినగ్రంథమునుగురించి తమ పత్రికలో ముచ్చటించుచు పై విషయములన్నియూ నిజముగా జరిగినవేయని బలపరిచిరి. అందు ముఖ్యమగు వర్ణనమును ఇచ్చట వ్రాయుచున్నాను.]

లాహోరునగరమున 1857 సంవత్సరము మేనెలయందు నాలుగు హిందూపటాలములు ప్రభుత్వమువారి అనుమానములకు లోనయ్యెను. ఆంగ్లేయులు సిపాయిలవద్దనుండి ఆయుధములన్నియూ బలవంతముగా లాగుకొని ఒకశిబిరమున బంధించిరి. నిరాయుధులగు ఆసిపాయిలను శిబిరమునుదాటి వచ్చుటకు ఆజ్ఞ యివ్వలేదు సరిగదా! వీరికిసరియగు ఆహారముకూడా పెట్టలేదు. ఆశిబిరముచుట్టునూ తుపాకులతో సిక్కులనూ, ఫిరంగులతో ఆంగ్లేయులనూ కాపలాపెట్టిరి. ఈవిధముగా ఆసిపాయిలను శిబిరములోనే యుంచి బాధించిరి.

జూలై 30-వతేదీరాత్రి 29-వ నెంబరు పటాలము తప్పించుకుని పారిపోయినది. ఈ 29-వ నెంబరు పటాలములో సుమారు 500 మంది సైనికులుగలరు. ఆసిపాయిలు ఆంగ్లేయప్రభుత్వమువారిమీద ఏవిధమగు ద్రోహము తలపెట్టలేదు. కేవలము శిబిరములో ఉండలేకనూ, ప్రభుత్వమువారు పెట్టు బాధలు భరింపలేకనూ పారిపోయిరని చెప్పవచ్చును. ఆసిపాయిలు రాత్రిఅంతయూ నడచి తెల్లవారునప్పటికి రావీనదీ తీరమునకు వచ్చిరి. నదినిదాటి అవుతలిఒడ్డునకు వెళ్లవలయునని ప్రయత్నించిరిగాని నది వరదతోఉండి బహువేగముగా ప్రవహించుటచే దానిని దాటలేక దానిగట్టునే అమృతసరము వైపునకు నడచి వెళ్ళిరి.

సిపాయిలు పారిపోయిరనుసంగతి జుడీషల్ కమీషనరగు సర్ రాబర్ట్ మాంటుగుమరీకి వెంటనే తెలిసెను. అమృతసరము డిప్యూటీ కమీషనరగు ఫ్రెడిక్ కూపరునకు పారిపోయిన సిపాయిలను వెంబడించి పట్టుకొనవలెనని కబురంపెను. ఆసిపాయిలు నిరాయుధులై ఆకలితో మలమలమాడుచూ అజనాలాఅను ఊరుకు ఆరుమైళ్ళదూరమున పడియుండిరి. అమృతసరమునకు 19 మైళ్ళ దూరమున అజనాలాయున్నది.

అజనాలా తాసిల్దారు ప్రాణనాథుడనువానికి పారిపోయిన సిపాయిలందరూ అజనాలా ప్రాంతములందే యుండిరనుసంగతి తెలిసిన వెంటనే అమృతసరము డిప్యూటీకమీషనరు ఫ్రెడిక్ కూపరునకు తెలియజేసెను. వెంటనే కూపరు 80,90 గుర్రపురౌతులను తీసుకొని అజనాలాకువచ్చి ప్రాణనాథుని మరికొందరు సిక్కులను అదనుగా వేసుకుని ఆపటాలమువద్దకు వచ్చెను.

ఆసిపాయిలకందరకూ రెండుమూడు దినములనుండి ఆహారము లేకపోవుటచేతను, రాత్రి తెల్లవార్లూ నడచియుండుటచేతను, నిస్సత్తువతో బలహీనముతో ముందునకు నడువలేక అక్కడపడియుండిరి. కొందరు నిస్త్రాణతో, ఒళ్లుపై తెలియక పడిపోయిరి. ఇటువంటి దీనులపై కూపరుగారి గుర్రపురౌతులును, సిక్కుసైనికులును తుపాకులను బారుపెట్టిరి. చేతులలో ఆయుధములు లేసందుననూ, రెండు దినములనుండి ఆహారము లేకపోవుటచేతను, ఆదీనులందరూ, చేతులుజోడించి, తమనిర్దోషిత్వమును ప్రకటించికొనిరి. ఆ నిర్దోషుల మొర నాలకించువారేరి? సుమారు 60 గాండ్ల తుపాకులవరకూ బారుపెట్టిరి. అందు 150 మంది సిపాయిలు గుండ్లదెబ్బలుతిని మరణించిరి. మిగిలినవారు నదిలోనికురికిరి. అది జూలై మాసము, వర్షము ఎడతెరపిలేక కురియుచున్నది. నది మంచివరదలోనుండి బహువేగముగా ప్రవహించుచుండెను. నదిలోని కురికిన బలహీనులగు సిపాయిలందరూ వరదతోపాటు ఒకమైలుదూరము కొట్టుకునిపోయి ఎగువనున్న ఒకలంకను ఆశ్రయించిరి. నదీప్రవాహమున కాగలేనివారు నదిలోమునిగిపోయిరి. ఇదిఅంతయూ చూచుచున్న అజనాలా తాసిల్దారు వెంటనే రెండు పెద్దపడవలు సిద్ధపరచి అందు సాయుధులగు సిపాయిలను ముప్పదిమందిని ఎక్కించి లంకవద్దకు పంపిరి. ఆపడవలు లంకను సమీపించగానే సిక్కులు తిర్గి తుపాకులను పేల్చిరి.

పాపము! నిర్భాగ్యులగు సిపాయిలు, సిక్కుసైనికులను చూడగనే తాము నిర్దోషులమనియు, ఏవిధమగు అల్లరులులేకయే ప్రభుత్వమువారికి లొంగుదుమనియు, ప్రాణదానముచేయమనియు ప్రార్థించిరి. ఆసమయమున అజనాలా తాసిల్దారు లంకమీదుకువెళ్లి "మీ ప్రాణములను రక్షింతుము. మీకేమియు భయములేదు." అని వారిని నమ్మించి పట్టుకొనెను. కాని కొందరు నిరుత్సాహులై నదిలోనికురికి చనిపోయిరి. మిగతావారిని పట్టుకొని కట్టివేసి పడవలమీద ఎక్కించి గట్టుపైకి చేర్చిరి. గుండ్లదెబ్బలుతినియు, నదిలోనికురికియు చనిపోయిన సిపాయిలు చనిపోగా, చెదరి అటునిటు పారిపోయినవారు పారిపోగా మిగిలిన సిపాయిలు మూడువందల ముగ్గురు (303) నిర్భాగ్యులు. వెంటనే కూపరుకూడా తనసైన్యముతో ఆప్రదేశమునకు వచ్చిచేరెను. అచ్చట కూపరు ఆసిపాయిల చేతులను కట్టివేసి లాఠీలతోకొట్టిరి. పవిత్రమగు హిందువుల యజ్ఞోపవీతములను, మహ

మ్మదీయుల కంఠమాలలను త్రెంపివేసెను. ఇంకను కసితీరక వారినందరను సంకెళ్ళతో కట్టి కొట్టుచు, చుట్టును సిక్కులు కాపుగాయుచుండ వర్షము హోరునగురియుచుండగా అర్థరాత్రమున అజనాలాకు ఆరుమైళ్ళదూరము నడిపించుకొని తీసుకొనివచ్చిరి.

అజనాలా తాసిల్దారు అంతకుముందే వీరినందరనూ ఉరితీయుటకు క్రొత్త తాళ్ళను తుపాకులను సేకరించుకొని యుంచెను. కాని ఆదినమంతయు ఎడతెరపిలేక వర్షము కురియుచుండుటచేతను, అర్థరాత్రి యగుటచేతను ఆ పని మరునాటికి వాయిదా వేయబడెను.

ఆసిపాయిలనందరినీ తెల్లవార్లూ ఎటుల కాపాడవలయును అను జిజ్ఞాస పట్టుకొనినది కూపరుగారికి. వారినందరినీ పోలీసుఠాణాయందు బంధించిరి. ఠాణా చాలలేదు. పోలీసుఠాణాకు, ఎదురుగా, ప్రభుత్వమువారి బిల్డింగు ఒకటి క్రొత్తగాకట్టబడి ఉండెను. ఆ కట్టడమునకు సంబంధించిన రికార్డురూములో మిగిలినవారిని కుక్కిరి.

రికార్డురూము మిక్కిలి చిన్నది. పట్టుమని పదిమందికూడాపట్టరు. ఆరూమునకు రెండు అరలు, రెండుద్వారములు కలవు. సిపాయిలను గూర్చుండబెట్టిన ఎక్కువస్థలమును ఆక్రమింతురని నిలబెట్టి 66 సిపాయిలను అందు కుక్కిరి. నాలుగుప్రక్కలను తలుపులు మూసివేసిరి. పాపము! నిర్భాగ్యులగు ఆసిపాయిలందరూ ఆకలితో అన్నమనియు, దాహముతో నీరుఅనియు, ఊపిరిఆడక గాలియనియు అరచిరి. దీనమగు ఆసిపాయిల పలుకులను విని కూపరుగారు ఆనందముతో గంతులిడిరట.

మరునాడు 1857 సంవత్సరము ఆగస్టు 1-వ తేదీ. బక్రీదు. మహమ్మదీయుల పండుగ దినము. పాపము! నిర్దోషులు, నిస్సహాయులు అగు ఆదీనుల కందరకును, ఒకేదినమున బలవన్మరణమును విధించిన ఆవిధాత ఉద్దేశమేమైయుండునోకదా!

కూపరు ఠాణాయెదుట కుర్చీలో కూర్చుండెను. పదిమంది సిక్కుసైనికులు తుపాకులతో నుండిరి. ఆనిర్దోషులనందరను పదిపదిమందిగ బయటకు తెచ్చి సంకెళ్ళతో కాళ్ళు చేతులను బిగించి, సిక్కుసైనికులముందు నిలబెట్టువారు. వెంటనే సిక్కులు తుపాకులను ప్రేల్చెడివారు. ఆవిధముగా ఠాణాలోని 237 సిపాయిలను కాల్చివేసిరి. తుపాకిగుండ్లదెబ్బలుతిన్న సిపాయిలు పడిపోగానే పాకీవాండ్రచే సంకెళ్ళు విప్పించి శవములను ఒకగుట్టగా వేయించిరి. ఆగుట్టలో కొందరుసిపాయిలు తుపాకిదెబ్బల బాధతో మూలుగుచునే యుండిరట. సిక్కులు తమతుపాకులను సిపాయిల గుండెలమీదికి బారుపెట్టిరి. కాని కొందరికి బుజములమీదను, కడుపుమీదను తగులుటచే వెంటనే మరణించక బాధతో మూల్గుచుండిరి. పాపము! ఆ సిపాయిలు బాధతో ఏడ్చుచుండిననూ నీచులగు పాకీవాండ్రు సిపాయిల కాళ్ళుపట్టుకొని యీడ్చిరి. ఈవిధముగా చనిపోయినవారిలో ఎక్కువమంది హిందువులు, మహమ్మదీయులు. వారు చనిపోవునప్పుడు సిక్కులమీదను, కూపరుమీదను, గంగాదేవిమీదను ఒట్టుపెట్టిరట. పోలీసుఠాణాలోనివారిని చంపినవెంటనే రికార్డురూములోనివారిని బయటకు తీసుకొని వచ్చిరి. కాని ఆగదినుండి 21 మంది మాత్రమే బయటకువచ్చిరి. మిగిలినవారు ''బయటకు రామనుచున్నామని'' కూపరుగారికి కబురువచ్చెను. వీరినికాల్చుటకు ఆజ్ఞయిచ్చి కూపరు గదివద్దకు వచ్చెను.

వెంటనే కూపరు అగ్నికణములను రాల్చ

చూ గదిగుమ్మమువద్ద మరియొక సిపాయిని ఆనుకొని నిలుచుండిన ఖైదీని జుట్టుపట్టుకుని బయటకులాగెను. తర్వాత ఇంకొకని, రెండు-మూడు-నాలుగు-ఐదు - యీ విధముగా రికార్డురూములో కుక్కిన సిపాయిల నందరునూ, బయటకులాగెను. కాని పాపము! ఆ సిపాయిలందరూ ఆకలితో మలమలమాడుచు "అన్నమని"యు, దాహముతో గొంతు ఎండిపోయి"నీరు" అనియు, గాలిలేక అలసటచెంది నిస్సత్తువచే అరచుటకును శక్తిలేక, "అన్నము- దాహము- గాలి- నీరు-" అని మూల్గి మూల్గి అర్ధరాత్రియే ఎప్పుడో చని పోయియుందురు. ఆదృశ్యమును చూచుచున్న కూపరు ఆశ్చర్యముతో 'అనుకోకుండగనే కలకత్తాలోని బ్లాక్ హోల్ కథ ఇచటకూడ జరుగుటకు' అనెనట.

పోలీసుఠాణాకు సుమారు ఒకఫర్లాంగు దూరమున ఒక పెద్దనుయ్యికలదు. ఆనుయ్యి బహువిశాలమైనది. లోతైనది. కాని పాడు పడియుండెను. కూపరుగారు చనిపోయిన ఆ 303 సిపాయిలను పాకీవాండ్రచే, ఈడ్పించుచు నూతిలోవేయించిరి. తర్వాత ఆనూతిమీద, అయిదారుగజములు ఎత్తు వచ్చువరకునూ, మట్టిపోయించిరి. పాపము! గుండుదెబ్బలు తిన్న సిపాయిలలో కొందరు బతికియే యుండిరి. అసలే గుండుదెబ్బతిని బాధపడుచూ మూల్గుచున్న సిపాయిలను పాకీవాండ్రు కాళ్లు పట్టుకుని ఫర్లాంగుదూరము రోడ్డుమీదను, మట్టిపెల్లలమీదను, ఈడ్చుకొనుచు తీసుకొని వెళ్లునప్పుడు ఒళ్ళంతయు కొట్టుకునిపోయి, చర్మమంతయు రేగి, మాంసము ఊడి సిపాయిలు పడినబాధ, ఏడ్చినఏడ్పులు యింతంత కాదని ఈదృశ్యము కళ్ళార కాంచియున్న అజనాలావృద్ధుడు బాబాజగత్సింహు నుడువు చున్నాడు. ఈవిధముగా కూపరుగారు 24 గంటలలో 29-వ నెంబరు పటాలమునకుచెందిన నిర్దోషులను బలవన్మరణముపాలు జేసెను.

ఈసంగతి ఛీఫ్ కమీషనరు సర్ జాన్ లారెన్సునకును, జుడీషల్ కమీషనర్ సర్ రాబర్ట్ మాంటుగుమరీకిని తెలిసినవెంటనే కూపరుగారిని బ్రహ్మాండముగా మెచ్చుకొనుచు ఉత్తరములను వ్రాసిరి.

తనవంటి సైనికుడును, ప్రభుత్వాభిమానియు మరియొకడు లేడని తెలియజేయుటకు గాబోలు కూపరుగారు ఈ ప్రశంసలనన్నిటిని తమగ్రంథమున ప్రకటించుకొనిరి. నిరాయుధులను కాల్పించిన తమ మహాప్రతాపమును- ప్రాణములను రక్షింతునని వారిని నమ్మించితీసికొనివచ్చి శిక్షించిన ప్రాణనాథుని ధైర్యశౌర్యములు విశేషమైనవనియు, అతడు ప్రభుత్వమువారికి చేసినమేలు మెచ్చుకొనుటకు తనకు శక్తిచాలదనియూ కూపరుగారే స్వయముగా తమగ్రంథములలో మిక్కిలి అభిమానముతో వ్రాసుకొనిరి. కూపరునకును, ప్రాణనాధునకును, సిక్కుసైనికులకును పెద్ద పెద్ద మొత్తములు ప్రభుత్వమువారు బహుమతి యొసంగిరి.

303 సైనికులను పూడ్చిన నూయి ఇప్పటికిని ఉన్నది. దానిపై ఐదారుగజములఎత్తు మట్టిదిబ్బకలదు. 45 గురు సిపాయిలు నీరులేక, గాలిలేక ఊపిరిసలుపక అలసటవల్ల తీసుకొని తీసుకొని చనిపోయిన రికార్డురూమును కలదు. నూతను లెవరయినను అజనాలాకు వెళ్లుట. తటస్థించిన ఆఊరివారు ఆనూతిని, ఆగదిని చూపి, నిర్భాగ్యులగు సిపాయిల దురదృష్టమునుగూర్చి విచారించి కంటతడిపెట్టుచుందురు.

అజనాలాలో జరిగిన ఈ భీకరసంఘటనము

లను కూపరుగారు స్వయముగా తమగ్రంథమునందు వర్ణింపకున్న మనకు దీనియందు గట్టినమ్మకము కలుగుట బహుకష్టమే. ఏలనన ఆదినములలో ఆంగ్లేయులు హిందూదేశమును తమయిష్టమువచ్చినట్లు పాలించిరనియు, భారతీయులను తెగబాధించెడివారనియు, హిందూ శిల్పకళయందు ప్రసిద్ధిగాంచిన వారిచేతులను తెగగొట్టిరనియు, గజము వెడల్పు గజములోతుగల గోతులలో కూర్చుండి సాలెపురుగు దారములకంటె బహుసున్నితమగు దారములతీసి వందలకొలది గజముల గుడ్డను నేసెడివారి వ్రేళ్ళను విరిచిరనియు, అందమగు స్త్రీ కనుపించినవెంటనే శిబిరములలోనికి ఎత్తుకునిపోయి వారివస్త్రములను విప్పివేసి వెనుకకు విరచికట్టి ప్రతిఆంగ్లేయసైనికుడును కనరాని వినరానిపనులను తనయిష్టము వచ్చినంతవరకుచేసి అవమానముల పాల్జేసిరనియు- ఉన్నవికొన్ని, లేనివికొన్ని చెప్పుట మన పెద్దలకు ఆచారమైయున్నది. * * *

ఇట్లు దుర్మరణముపాలు చేయబడిన నిరాయుధులగు సిపాయిలు ప్రభుత్వమువారిమీద ఏవిధమగు ద్రోహముగాని, విప్లవమునుగాని తలపెట్టలేదనుసంగతి పాఠకమిత్రులు ఎన్నడునూ మరువకూడదు. * * *

రావీనది యొద్దనుండియు, సీటెలోదుమికియు అటునిటు చెదరిపోయి పారిపోయిన, సిపాయిలు రెండుమూడు దినములలో పట్టుబడి, చంపబడిరి.

---

## ఓయి పరమేశ!

ప్రధితప్రేమైకజీవితరంగమందు
నుదయమగు నాదు భావాలనుక్కడించి
విముఖుజేసెద వేల? నీ విశ్వప్రేమ
నెచటదాచితి; నాతప్పదేమి? దేవ!
ప్రకృతిసౌందర్యమును నేను బాడువేళ
కుత్తుకబిగింతు వీవు; ఏక్రొత్తనైన
జూడనెంచిన నామది పాడుజేసి
తెంపులేని విషాదపు తెరదగుల్తు;
హృదయదౌర్బల్యమునుగూర్చి యెడదబాడము
ఆశలనుద్రుంచివైతు నిరాశలోన,

ములుమూడి ఆదిశేషాద్రిరెడ్డి

భీకరవిషాదతిమిరావృతైకపథమె
నాకుజూపించెదవు పయనమ్మునేయ;
ఐన మంచిది; నీకు నాయందుగల కృ
పావిశేషాని కెంతయు పరమపురుష!
సంతసించెద; నేను నీ సంశ్రయమున
పావనుడనై తరింతు నీ ప్రకృతిగలసి;
ఓయిపరమేశ! యేచింతయుండ దింక
నాకు నీపయిగలుగు ధ్యానమ్ముతప్ప;
ఏవిషాదజీవనమైన నేవగింప,
నేమనోహరజీవన మేనిగోర.

## మేము: ప్రకృతి

పరిణత ప్రేమజీవిత, శు
  భంబుల కాస్పదమైన మాయెదల్
తరచదలంచెనేమొ, విధి
  తాలిమిదూలి, పరార్థవంచన
స్ఫురణదనర్చు సంఘమను
  భూతపుకట్టడి కట్టుబాట్లలో
సురుగము; స్రుక్కబోము; విధి
  శోధన జిక్కము; స్వేచ్ఛనీల్గెడన్.

ములుమూడి ఆదిశేషాద్రిరెడ్డి

విమలస్వేచ్ఛానుజీవన ప్రేమకలిమి
మధురభావాల వెలిబారు మహితగాన
కళలదేల్తుము ప్రకృతిని చెలిమితోడ
నెంతయు నభేదభావంబు దొంతరిలగ;
ప్రకృతికిని మాకు భేదభావంబులేదు
ప్రకృతి కడుగూర్చు మాకనురాగమెసగ
ప్రకృతికిని మేముగూర్తుము భావగీత
మాలికలపూలమాల సమానప్రేమ;

# చదువుకు నేటప్పటి చిదంబరం

రచయిత:

యం. వి. కృష్ణరావు, బి. ఏ., (ఆనర్సు)

నేను ప్రెసిడెన్సీలో ఆనర్సు చదివేదినాల్లో జరిగినసంగతులు: ఆ హాయిదినాలు తలుచుకుంటేనే చాలు!— మామిత్రబృందంలోకల్లా గట్టివాడు శాస్త్రి. శాస్త్రి పొట్టిగా లావుగా నల్లగా ఉండేవాడు. సన్యాసులమాదిరి సర్వకాల సర్వావస్థలయందు కాషాయవస్త్రాలు. బ్రహ్మచారికాబట్టి— అయినా మనలోమాట, వాడికి పిల్లనిచ్చేదెవరు? — యితణ్ణిచూసిన ప్రతిపిల్లా - ఈశారదాబిల్లు తర్వాత అంతా ఎదిగి వివేకవిచక్షణజ్ఞానంకలవారు గాదండీ మరి!—మేము చేసుకోమో అని, లేకపోతే పగలుచూస్తే రాత్రికల్లోకి వస్తాడని తిరస్కరించారు - హామేషా గూడకట్టు, మోకాళ్ళవరకు పంజాబీలాల్చీ, హైరోడ్డుక్రాపు, కాళ్లకేపున్నా కిఱ్ఱుచెప్పులు వేసుకుని బయలుదేరాడంటె సాక్షాత్తు స్మశానంనుంచి టపును కొచ్చిన పెంటపాడుబైరాగి లాగుండేవాడు. ప్రపంచంలోని అన్నివిషయాల్నిగురించి సవిస్తరంగా తెలుసునంటాడు శాస్త్రి; మంచినీళ్ళప్రవాహంలా యెన్నిగంటలైనా యేవిషయాన్నిగురించైనా ఊకదంపుడు చేసే అగ్గిబరాటా. అవకాశంవస్తే యెవర్నిపడితే వాళ్ళని కళ్ళనీళ్ళపర్యంతం వచ్చేటట్లు చేయగల సమర్థుడు.

మామండలిలో చిదంబరం అనే సింపిల్టన్ వుండేవాడు. అలగాడు పరమయోగ్యుడు. ఆయితే 'బారిస్టరు పార్వతీశం' అంత ఘనుడు. ఆత్మస్తుతిలో పెట్టిందిపేరు; వాడు కోసేకోతల కంతులేదు. వాడికి కొంచెంగా కీయిచ్చి విడిచిపెత్తే పాడటానికి 3 తవ్వాలు, పాటాపటానికి 6 తవ్వాలు కావాలన్న బుద్ధిమ్మంతుడిమాదిరి పూతపట్టాడు. చిదంబరానికి కించిత్ పొడుం అలవాటు కూడా కద్దు.

ఒకనాడు సాయంకాలం పొద్దుపోకపోతే చిదంబరాన్ని తీసుకెళ్ళా మెరీనాకి. కూర్చున్నప్పటినుంచి మళ్ళీ బయలుదేరేవరకు వాడి సొంతఘోషే; ఒకటేమోత.

"ఇదుగో, రావు! ఎవరితో చెప్పకేం. (అందరితోటి యిదేవరసట) నాసతీమణి అసమాన సౌందర్యవతి. (యింకాయేమన్నా చెబుతాడేమోనని యెదురుచూశా). ఏమంటావు?"

"నన్నేమనవంటావయ్యా! నేను చూడలేదు, అట్లాంటిది నేనేమి చెప్పలేను. నీసతీమణి చాలబాగుంటె నువ్వే తంటాలుపడు. ఎవరొద్దన్నారు, మధ్య నాప్రాణాలు కొరుకుతావెందుకు?"

"ఆహా. అదికాదు సంగతి. నాభార్యకు ఈడువచ్చి వడసారం అయిదేళ్ళయింది. మామగారు శుభకార్యం కానివ్వమంటారు. మనం యింగ్లీషువాళ్ళపద్ధతుల్ని అనుసరిస్తాం కాబట్టి యిట్లాంటివి బహిరంగంగా చేసుకోవడం నాకిష్టంలేదు. నీసలహా యేమిటి?"

"మనవాళ్లు యేదిచేసినా బహిరంగమో అని పడిచస్తారు. పిల్లలుపుట్టినా, చచ్చినా, ఆడపిల్ల సమర్తాడినా, శోభనంచేసుకున్నా, ఒకటేమిటి? కర్మకాండ అంతులేకుండా పెరి

గిన తర్వాత మతం యావత్తు నాశనమైపోయింది. ఈబహిరంగాలతో చచ్చిపోతున్నాం. ఎవడిక్కావా లివన్నీ ; ప్రజాబాహుళ్యానికిట్లాంటి విషయాల్లో యేమంత ఉత్సాహముంది? సరే ఈగోలకేంగాని, అడగటం మరిచాను. క్రిందటినెల నూరు రూపాయిలు వచ్చినట్లుంది. అదంతా యేమైంది ? నెల తిరగక ముందే మళ్లా తెప్పించావు.''

''దానికి చాల పెద్దగాథవుందిలే. ఆనాడు సాయంకాలమే చెల్లారాంషాపుకెళ్లి యీఆకుపచ్చ సర్జికోటు కుట్టించాను (చిదంబరం తొడుక్కున్నకోటు చాల పాతదిలెండి! వాళ్ళబాబు చిన్నప్పుడు కుట్టించుకొని వుంటాడు ; కుట్టుమాదిరికూడా పురాతనమే!) బట్ట మాత్రం 75 రూపాయిలు. వాడిసిగతరగా ఆయిస్టాయిల్ కోటుకుట్టడానికి ఫక్తు పదిరూపాయిలు తీసుకున్నాడు. ఆరాత్రే రాక్సీకి వెళ్లి హాస్టలుకి చేరుకునేసరికి జేబులో ఐదురూపాయిలున్నాయి – నమ్ము నమ్మకపో. (నూరేమైనాయో దేవుడికేయెఱుక – బహుశ నలభైయే వచ్చాయేమో ; వచ్చిందానికంటె యెక్కువ చెప్పుకునే బడాయికోరు మాచిదంబరం!)

''అరేచిదంబరం ! ఇక పూతచాలు. ఎనిమిదవవచ్చింది ; యింక పొద్దుపోతే హాస్టల్లో దేవతార్చనుండదు. తెల్లవార్లు పస్తుపడుకోవాల్సివస్తుంది.'' * * *

ఆదివారం మధ్యాహ్నం అందరు 'అన్నాకరినీనా'కి పట్టుపట్టమన్నారు. చిదంబరంచేత సూటు వేయించా రానాడు. గుండీలులేని సన్నని గొట్టాలాంటి పంట్లాము. మేజోళ్లులేకుండా కాళ్లకు బ్రౌన్ కాన్‌వాసుజోడు – యిప్పుడిదే ఫేషనట – పట్టీపట్టని ఆ ఆకుపచ్చ సర్జికోటు, ఎందుచేతో తిరగకుండా ఆగిపోయిన చేతిగడియారం (బహుశ వాడిమామగారు వివాహసందర్భంలో కానుకగా యిచ్చివుంటారని శాస్త్రి రిసెర్చిచేసి కనిపెట్టాడు). టర్కీటోపీ పెట్టుకుని అచ్చుమచ్చు ఊదువత్తులవాడిలా బయలుదేరాడు. వాడివేషంచూస్తే మాకు కడుపు చెక్కలయే టంత నవ్వువచ్చింది. బయటకు నవ్వేస్తే కనిపెట్టి రాడేమోనని పొంగిపొరలి వస్తూన్న నవ్వుని ఆపుకున్నాం.

ఒక చక్కని ఆంగ్లోయిండియన్ అమ్మాయి. వయసులోనిపిల్ల. సన్నగా, నాజూకుగా– అవయవపటుత్వాన్ని వెల్లడిస్తూన్నగౌనుతో, గుమగుమాయింపుతో 'పేరగన్' థియేటరులో కూర్చునిఉన్నది. అందరికి ఆసౌందర్య దృశ్యాన్ని చూడకుండా ఉండటం కష్టమైంది. మాచిదంబరంకళ్లు ముందా పిల్లమీదేపడ్డాయి. ఆఅమ్మాయి ప్రక్కనే నదురు బెదురు లేకుండా పీఠంవేశాడు. మేముకూర్చుని కాసేపైందోలేదో ఫిలిమ్ బులెటెన్సు అమ్మేవాడు వచ్చాడు ప్రోగ్రాంలకి. ఆ ఆంగ్లోయిండియన్ వనితే వాడిని పిలిచింది. ఆపిల్లదగ్గర నోట్లేఉన్నాయి– చిల్లరలేదుట– మావాడివంక అర్థయుక్తంగా చూసిందిట. మాచిదంబరం వెంటనే ''ఐ షల్ పే హిమ్'' అని కిన్నెరసాని గొంతుతో అన్నాడు, తిరిగి యిస్తుంది గదా అనే సదుద్దేశంతో. నిజానికి చిదంబరం అంత్యోపయోగం (మార్జినల్ యుటిలిటీ) లేందే కానీ ఖర్చుపెట్టే ఘటంకాదు.

పిక్చెరు మొదలుపెట్టినప్పటినుంచీ మాచిదంబరానిది పక్కచూపేగాని ముందుచూపు లేనేలేదు. మధ్యలో ఆవగలాడితో యేవిధంగానైనా కల్పించుకుని మాట్లాడటానికి సర్వవిధాలా ప్రయత్నంచేశాడు. అయితే ఆఅమ్మాయి ఉలక లేదు – పలుకంతకన్నా లేదు. ఏదో పిక్చెర్ని చూడటానికంటె వచ్చిందిగాని వీడితో

బాతాఖానీ కొట్టడానికి రాలేదని తెలియదు మాచిదంబరానికి. పిక్చెరు అయిపోయింది.

"చిదంబరం! ఆ ఆంగ్లోయిండియన్ పిల్ల తిరిగి నీ అణాయిచ్చిందీ? నీపని ట్రాజడీ యట్ వరస్టు అయిందిలే!"

"ఏమితపంబొనర్చి జనియించినవాడనో-శాస్త్రీ! తిరిగి యియ్యకపోతేనేం?"

"ఏమిటిరాకథ; యేంజరిగిందేమిటి?"

"పిక్చెర్ మంచి రసకందాయపు పట్టులో ఉన్నప్పుడు ఉక్కగాఉంటె సర్జికోటు తీశాను. చీకట్లో ఆవని తేంచేసిందనుకున్నారు? నాచేతులు ఆడవాళ్ల చేతుల్లా మెరిసిపోతున్నాయి చీకట్లో. నాచేతిమీద తనచెయ్యివేసింది. ఏమనుకుందో మన పెర్సనాలిటీచూసి డంగయిపోయిందేమో! వెధవ అణాపోతే పోయింది గాని, ఏమి సుఖమనుకున్నావు, శాస్త్రీ!"

"అయితే ఎక్కడన్నా లంగరుఅందినట్లేనా? చిదంబరం."

సన్యాసివాడి కర్థమైతేగా అవ్రజపు తునక లాంటి ముక్క. మాచిదంబరం యెంత అల్ప సంతోషో మాకప్పుడు బోధపడింది. * * *

చిదంబరంమీద ఒక ప్రాక్టికల్ జోక్ చెయ్యాలని గూడుపుఠాణాచేసి స్కీమొకటి తయారుచేశాం. శాస్త్రి యేస్నేహితుడియింట్లోనుంచన్నా ఫోనులో చిదంబరాన్ని పిలవడం: "హల్లో చిదంబరంగారు! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు – నేను మృణాలిన్ని. మనం రాజమండ్రీ హైస్కూల్లో సహపాఠులం. నేనిప్పుడు క్వీన్ మేరీస్ కాలేజీలో చదువుతున్నా. రేపు సాయంకాలం ఆరుగంటలకల్లా మైలపూరు బీచికి తప్పకుండారండి"......... అటునుంచి నరుక్కురమ్మన్నారు.

మర్నాడు సాయంకాలం ఐదుగంటలకల్లా రంగున పేఠంటు యూనిఫారమ్‌లో బయలుదేరాడు చిదంబరం.

"ఎక్కడికిరా చిదంబరం?"

'అరే బ్రదర్. సెంట్రలుకి వెడుతున్నా. సాయంకాలం మెయిలు (?) లో మాబాబు వస్తారుట. ఈదినం మీతో షికారుకి రాలేన"ని యెట్లాగైతేనేమి ఉడాయించాడు.

శాస్త్రీ, నేను వాడువెళ్ళిన పావుగంటకి వేరేదారిని మైలపూరుబీచికి పట్టించాం. మేము వెళ్ళేసరి కాచిదంబరం యేంచేస్తున్నాడనుకున్నారు? కొత్తపిట్ట తలవని తలంపుగా తనవల్లోపడ్డదనుకుని ఆడవేషంలోఉన్న మా సీతాపతిని గట్టిగా కావలించుకుని......

"చిదంబరం! ఆగు. మేమింతమంది నీ ప్రాణస్నేహితులం ఉండగా నువ్వొక్కడవు మాత్రం ఆసుఖం అనుభవించాలీ?"

ఆమాటలు వినేసరికి చిదంబరానికి నిలువల్లా ముచ్చెమటలు పోసి నిస్తబ్ధుడైనాడంటె నమ్మండి. నవ్వాపట్టలేక సీతాపతి

"సమయానికి వచ్చారురా బాబు! లేకపోతే కొంపతీసి నన్ను మృణాలినే అనుకుని వద్దు వద్దన్నా – నోట్లోవేలుపెట్టినా కొఱుకలేడని మీరన్న చిదంబరం–నన్ను ఉక్కిరి బిక్కిరి అయేటట్లు కావలించుకుని బుగ్గలు పూట్లు పడేటట్లు కొరికేవాడే" అని గట్టిగా అనేశాడు. అసలు మాసీతాపతి లవ్‌డ్‌స్పీకర్.

"శాస్త్రీ! మీరింతవాళ్ళని యెన్నడూ అనుకోలేదు. మంచివాళ్ళ కివి రోజులుకావు" అని చిదంబరం గుడ్లనీరు గ్రుక్కుకున్నాడు.

తగినశాస్తి అయేసరికి చిదంబరంలో తగిన మార్పు కలిగిందని శాస్త్రి పుకారు వేశాడు; అయితే నాకుమాత్రం నమ్మకం లేదు. ఎంచేతనంటె మాచిదంబరంతత్వం యింత తొందరగా మారుతుందా? ఆ విషయాన్ని గురించి కాలమే తెలుపుతుంది.

# నల్లమనిషిని కోరిన కమల—కమలను కోరిన నల్లమనిషి

రచయిత:

శ్రీ రామారావు

దినంవుదయాన లేచేసరికి పోలీసువాళ్ళ బీటులాగ గడియారం ఆరుఅయి అలారంకొట్టేది. గడియారంఆరు అలారంకొట్టినప్పుడు మాత్రం నాకు మహాచెడ్డకోపంవచ్చి గడియారాన్ని నేలనేసి పగులగొడదామా అనిపించేది దీనిసిగదరగా! కొంచెంసేపుండి తన అలారంగంట కొట్టుకోకూడదు! కాని మరుక్షణమే మిల్లుమొదటికూత నాగుండెల్లో రైలు నుపరుగెత్తించేస్తుంది. మూడవ కూతలోగా మిల్లులోకి వెళ్ళకపోతినా నావుద్యోగానికి తిలోదకాలు సమర్పించాలిసిందే. కాని మిల్లు కూసినప్పుడుమాత్రం గడియారంమీద నాకు; సమయానికి హెచ్చరిస్తూలేపి తన డ్యూటీ తాను అతినమ్మకంగా చేస్తున్నందుకు భక్తి విశ్వాసాలు కలిగేవి. పాపం అదిమట్టుకు ఏంచేస్తుంది? గడియారం ఆవిధంగా తనడ్యూటీ సరిగ్గా తనుచెయ్యకపోతే నావుద్యోగానికి ఏనాడోవచ్చేది ఆఫీసునుండి శ్రీముఖం.

ఆనాడు ఆదివారం. మిల్లుకు శలవు. ఇష్టం వచ్చినంతసేపు నిద్రపోవచ్చు. కాళ్ళచివర దాకా ముసుగుతన్ని గడియారం అలారం గంట,(అలారంకి శనివారంఇవ్వలేదు కాబట్టి) మిల్లుకూత;ఈరెండూ ఈదినం నన్ను బాధించవుగదా అనేదిలాసాతో గుండెలమీద చెయ్యివేసుకుని హాయిగా నిద్రబోయి ఎనిమిదిఘంటలకు లేచాను. ఇంకా నిద్రపోదామని వుంది గాని నిద్రపట్టడంలా! అంచేత శీఘ్రంగా లేచాను.

లేవడంతోనె ఏ అసహ్యాపుముఖం చూడాలిసివస్తుందో అని అద్దంలో నాముఖమే చూసుకున్నాను. మొటిమలతో, స్ఫోటకం మచ్చలతో నానల్లనిముఖం ఇతరులకు ఎల్లా వుంటుందో నేను చెప్పలేను కాని నాకుమాత్రం చాలా అందంగా వుంటుంది. ఈమధ్యనే పత్రికలలో నమ్ము - నమ్మకపో అనే వ్యాసాలలో రోజు తెల్లవారి నిద్రలేచి అద్దంలో ముఖముచూచుకుంటే ముఖానికి అందంవస్తుందని వ్రాయబడియుండడంచేత దినం అద్దంలో ముఖంచూచుకుంటూ ఉండడం అలవాటు చేసుకున్నాను. కాని నాఅందంమట్టుకు అద్దంలో దినం వుదయంచూసుకోకముందు ఎట్లావుండేదో ఇప్పుడు అల్లాగేవుండి, ఆ మొటిమలు, ఆస్ఫోటకం మచ్చలు, ఆచీడపొక్కులు నాముఖంలో ఆకాశంలో నక్షత్రాలు, నవగ్రహాలు, సూర్యచంద్రులులాగే స్థావరములైపోయినాయి.

తర్వాత ముఖంకడిగి, స్నానంచేసి టాయిలెట్టింగు పూర్తి చేసుకుని, కాఫీత్రాగి, సిగరెట్టు కాల్చుకుంటూ ముందు కార్యక్రమమేమిటాయని ఆలోచించుకుంటూ పడక్కుర్చీయందు కూర్చుని పత్రిక చదువుతున్నా. ఆదినం సాయంత్రం 4-30 ఘంటలకు తిలకుఘాటు బీచియందు మహిళాసభ జరుగుతుందని ఎంగేజ్మెంట్సు కాలంలో వుంది. మీా

టింగుకు ఈదినం తప్పక వెళ్లాలని నామనస్సు పరుగు వేసింది. పత్రికను పూర్తిచేసి భోజనం చేసి తిరిగి నిద్రపోయి 4 ఘంటలకు లేచి ముస్తాబై బైలుదేరాను.

మీటింగు 6-30 ఘంటలకు పూర్తి అయింది. అందరు వెళ్ళిపోయారు. కొద్దిగా మాత్రమే అక్కడక్కడ తిరుగుతున్నారు. నేను అక్కడేతిరుగుతూ కూర్చున్నా ఆలోచిస్తూ ఏసినీమాకు పోదామాఅని. చల్లని సముద్రపుగాలి, రేడియోపాట, సముద్రపుహోరు మనస్సుకు సంతోషాన్ని తృప్తిని కలిగిస్తున్నాయి. కాని కొంతసేపట్లోనే నాదృష్టి అక్కడ కొంచెందూరంలోనే ఇసుక తిన్నెమీద పడివున్న ఒకచిన్న చేతిసంచీని ఆకర్షించింది. దగ్గరకుపోయి దానిని తీసుకుని చూస్తున్నాను. ఆసంచీయొక్క అందం 'పనివాడితనం నన్ను ముగ్ధుణ్ణిచేశాయి. పాపం ఈసంచి ఎవ్వరిదోగాని మీటింగుకువచ్చి వదలిపోయినారు. దీనిని నేను వారికి ఏవిధంగా అందచెయ్యడం'అని ఆలోచిస్తున్నా. బహుశః ఇది ఎవ్వరో ఒక సుందరయువతిదై యుంటుందని వూహించాను. నా ఆతృత నన్ను ఆసంచి తెరవకుండా వుండనిచ్చిందిగాదు. తెరిచాను. ఒక వుత్తరం అందులోవుంది. ఆజాబు మడత విప్పడంతోనే మంచి సువాసన ఆపరిసర ప్రదేశాన్నంతా ఆవరించింది. ఆ వుత్తరం రాసింది ఒక స్త్రీఅయివుంటుందని దస్తూరినిబట్టి అనుకున్నా. ఆ వుత్తరానికి ఒకపక్క చిన్న అందమైన ఒక చిన్న స్త్రీఫోటో అంటించబడి వుంది. ఆఫోటోను చూస్తూ అల్లా ఆ విధంగా ఎంతసేపున్నానో నాకే తెలియదు. ఆస్త్రీయొక్క సౌందర్యం, ముద్దులొలికే ఆ ముఖం, ఆకనుముక్కుతీరు శంఖంలాటి సన్ననైన ఆమెడ, పద్మంలాగ వికసించిన నేత్రాలు నన్ను ముగ్ధుణ్ణి చేశాయంటే అతిశయోక్తి కాదు. ఇటువంటి అతిలోక సౌందర్యమూర్తి, అందాలరాణి యనదగు స్త్రీని నేను నాజీవితంలో ఇంతవరకూ చూచి ఉండలేదు.

ఆవుత్తరం చదవటానికి మొదలు పెట్టా. అందులో ఈవిధంగా వుంది :

"ఈవుత్తరం చదివే మానవుడు చాలా అదృష్టవంతుడు నేను అగాధమైన ప్రేమ సముద్రమునబడి ఒడ్డుచేరుటకు ప్రయత్నించుచు నిరాశచెందియున్నాను. నామనస్సుకు నచ్చిన మానవుని కలుసుకొని నామనఃపూర్వకమైన కోరిక నెరవేర్చుకొనుటకు నేను ఈమార్గ మవలంబింపవలసివచ్చినది. నల్లటి మనిషి అంటే నాకు చాలా ఇష్టం. వారే నాయొక్క ప్రేమవిశ్వాసాల్ని పొందుటకు అర్హులని నేను నమ్ముతాను. కావున ఈవుత్తరంచూచిన వారు నాకు నచ్చిన పైవిధపు మనిషియగునెడల వారు నాకడకు ధైర్యముగా రావచ్చును. అట్లుగాక ఈవుత్తరము చూచువారు అందచందాలు గల మానవులైతే వారు ఈవుత్తరం తిరిగి ఈసంచిలో వుంచి వారు ఈసంచి ఎచటకనుగొనిరో అచట దయతో నుంచవలెనని నాకోరిక.

ఇట్లు,
కమల.
170, అంగప్పనాయకన్ వీధి,
జి. టి., మదరాసు."

ఈవుత్తరాన్ని నేను రెండు డజన్లసార్లైనా చదివివుంటా. నాకు ఏమిచేసేదానికి తోచక గుడ్లు మిటకరిస్తూ ఆకాశంవేపు చూస్తూ ఆలోచిస్తున్నా. ఈయువతి నిశ్చయంగా ఒక దురదృష్టవంతురాలై వుండాలని అనుకున్నా. అనేకపర్యాయములు ఈమె అనేకమంది

అందమైన యువకులవలన మోసగింపబడింది కాబోలు; ఇప్పుడు వాళ్ళంటే ఇంత అయిష్టంతో చీదరించుకుంటూంది. ఆకారణంవల్లే ఆమె ఇప్పుడు అనాకారులైన వాళ్ళయొక్క సహాయంకోరటం దీనికంటె ప్రేమకోరటం కూడాను; అని ఆలోచించాను, ఆమెను నిరాశాబంధములనుండి తప్పించినట్లైతే అలా అదృష్టవంతుణ్ణి అవుతాను గదాయని అనుకున్నా. నేను ఎన్నికష్టాలువచ్చినా సరే, ఎన్ని అవాంతరాలు కలిగినాసరే లక్ష్యం చెయ్యక కష్టసముద్రంలో పడి యీదులాడే ఈ అభాగ్యయువతి, మరచా! కమలకు తప్పక సహాయంచేసి శాంతిసుఖం కలిగేటట్లు చేయడం అవుసరమైతే నా అర్ధాంగిగా చేసుకోటానికి కూడా ఒప్పుకోని............ ............అని మనస్సులో సముద్ర దేవుని, అప్పుడేవుదయించే చంద్రుని, నా మనస్సులో రేగుచున్న తుపాను గ్రహించలేక బీచిలో తిరుగుచున్న ప్రజల సాక్షిగా ప్రతిజ్ఞ చేశా.

నేను యుద్ధంలో విజయంపొందినవాడిలాగా అత్యుత్సాహంతో లేచి ముందుకు నడుస్తున్నా. నాకు సముద్రం, రేడియోలు విజయాన్ని సూచించే వీడ్కోలు గీతికలు పాడుతు నన్ను వీడ్కోలుపుతున్నట్లున్నాయి. దగ్గరగావున్న హోటలుకుపోయి భోజనంచేసి జి. టి.కి పోదామని బస్సుస్టాండువద్దకు గబగబా వెళ్ళా. నా అదృష్టం ఏమిటో అప్పుడే, జి.టీ.కి పోయేబస్సు చక్రం పాడయి మరమతులోవుంది. తర్వాతబస్సు బైలుదేరటానికి ఇంకా కొంచెం ఆలస్యం అవుతుందని సంగతి తెలిసింది. కమలను చూడాలనే కోరికతో వువ్విళ్ళూరిపోతోంది నామనస్సు. నిజంగా ఆనాడు కమలను కలుసుకోక ఇంటికిరావటం చాలా పరిహాసాస్పదం, విధ్యుక్తదర్శానికి తప్పడం అనుకొన్నా.

ఆలస్యానికి నామనస్సు ఒప్పుకుందికాదు. దగ్గరలోవున్న టాక్సీకంపెనీకిపోయి ఒక స్పెషలు టాక్సీలో జి.టీ.కి బైలుదేరా.

జి.టీ.కి వెళ్ళే కాశ్మైపులో కట్టిన గాలిమేడలు ఇన్ని అన్ని కావు. అదృష్టవంతుని చెరిపేవాడు దురదృష్టవంతుని బాగుచేశేవాడు లేడుగదా? నాఅదృష్టంకాకపోతే ఇది నాకే ఎందుకు దొరకాలి.తప్పక నేను అదృష్టవంతుడను,సత్యంగా నేను అదృష్టవంతుడను, ముమ్మాటికి అదృష్టవంతుడనే. నాకంటే అదృష్టవంతు డింకెవ్వడుంటాడు. ఇంకా ఒకటి, రెండు నిమిషాల్లో నేను ప్రపంచమంతలోనూ అందమైన ఒక యువతితో మాట్లాడబోతున్నానుగదా! నిరాశాతప్తమైన ఆమె హృదయాన్ని శాంతివచనాలతో శాంతిపరస్తూ, ప్రియమైన వచనాలతో ఆమెహృదయాన్ని ప్రేమప్రవాహంతోనింపి శెల్లువ అయ్యేటట్లు ప్రయత్నిస్తా.

కమల నాదగ్గరకు చిరునవ్వు నవ్వుతూ, ఆనందంతో వుప్పొంగుతూ, చంచలనేత్రాలతో వచ్చి నాపక్కకూర్చుంటే నేను అటువంటి ఆనందం! అబ్బా! నాజన్మ తరిస్తుంది. నన్ను కమల తప్పక అభిమానిస్తుంది.ఏమో? ఎవరికి తెలుసు? ఆమె నన్ను వివాహమాడగోరుతుందేమో? అదృష్టవంతుడను.

ఈవిధంగా అనుకొంటుంటేనే జి. టి. కి వచ్చి ఆవిలాసానికి చేరుకున్నా. అది పెద్ద అంతస్థులమేడ. రాజాంతఃపురాన్ని సూచించే ఆమేడ చూసేసరికి నామనస్సులో వ్యాకులంచేత, వుద్రేకంచేత అదోమాదిరిగా మారింది. ఇదిఒకవిధంగా మంచికే వచ్చిందేమో అని తలచి లోపలికివెళ్ళి రెండో అంతస్థుకు

చేరుకున్నా.

అక్కడవుండే జవాను ఒకడు "ఏమి పని మీద వచ్చారని ప్రశ్నించాడు."

నేను వచ్చినపని చెప్పేను.

వాడు లోనికిపోయి తిరిగివచ్చి నన్ను మేనేజరు గదిలో ప్రవేశపెట్టాడు.

నేను మేనేజరుతో బీచిలోజరిగిన సంగతంతా చెప్పి అతనికి వుత్తరం, ఫొటోను చూపించాను. "మీరు చాలా అదృష్టవంతులు సుమా" అన్నాడు మేనేజరు చిరునవ్వు నవ్వుతూ.

"మీరు కమలతండ్రిఅని తలుస్తాను." అని అడిగాను. "కమల అనేకమంది చూపులకు అందంగావుండే దుర్మార్గులవల్ల మోసగింపబడి వుంటుంది, నిజమేనా పాపం అమాయకపు పిల్ల–నేను ఆమెను చూడవచ్చునా?" అన్నాను. "ఓ తప్పక" అని మేనేజరు పక్కనేవున్న ఒక చిన్నగదిలోనికి వెళ్ళి ఒక చిన్న ప్యాకెటు చేతపట్టుకు వెంటనే తిరిగివచ్చి "మీరు ఈప్యాకెట్టుతీసుకుని నాకు ఎనిమిది అణాలు ఇవ్వండి. తర్వాత నేను కమలసంగతి చెబుతా" నన్నాడు.

నేను అతితొందరగా ఆయనచేతిలోవుండే ప్యాకెట్టు తీసుకుని ఎనిమిది అణాలు ఇచ్చేను.

ఇది మా "కమలా ఫేస్ - పౌడరు" అని మేనేజరు చిరునవ్వు నవ్వుతూ నాతో చెప్పాడు.

"ఇది ముఖముమీది మొటిమలు, నల్లని మచ్చలు, వివిధరకములైన చీడ పొక్కులను పోగొట్టుటయందు గొప్ప ఔషధరాజము. ముఖమునకు కాంతినిచ్చి, తేటపరుస్తుంది. చర్మమునకు ముఖమలువలె నునుపు మెత్తదనాల్ని కలిగిస్తుంది. మేము మాయొక్క ఔషధములను ప్రజలకును అందచేయుటకు ఈవిధముగా ప్రకటించుటకు పూనుకొని యున్నాము. మీరు ఈనాడు బీచిలో గనుకొనినది అటువంటి వుత్తరమేను" అని చిరునవ్వుతో చెప్పి గుడ్-బై అన్నాడు మేనేజరు.

# కుంకుమపువ్వు

రచయిత:

గుమ్మలూరు సత్యనారాయణ, బి. ఎస్‌సి. (ఎజి.)

కుంకుమపువ్వును ఆంగ్లమున సాఫ్రన్ అందురు. ఈపదము తొలుత ఫ్రెంచిభాష లోనిదియని యందురు. అరేబియాప్రాంతము లలో జఫరిన్ యని పిలుపు. వృక్షశాస్త్ర కారులు దీనిని 'క్రాకస్ సటైవస్' యని పిలుతురు. ఇది యేకదళబీజములలోనిది. మన దేశమునందిది కాశ్మీరములో విస్తారముగా దొరకుచున్నది. ఈజాతిమొక్కలు వర్ష కాల మారంభమవగనే ప్రతిచోటను, యిండ్లమీ దనుకూడ, మొలచి కనులకు సుందరదృశ్య ములను ప్రతిఫలించుచుండును. దక్షిణహిం దూస్థానమున ఉత్తరమునకంటె దీనివాడుక తక్కువ. పూర్వము యిప్పటికంటె పాశ్చా త్యులు దీని నెక్కువగా రంగులువేయుటకు కొనెడివారు. కాని రానురాను ఖరీదుతక్కు వగల వస్తువులువచ్చి కుంకుమపువ్వు విలువను పాడుచేసినవి.

కుంకుమపువ్వు దత్తత సుగంధద్రవ్యము. తొలుత నిది నూలునకు, పట్టునకు రంగువే యుట కుపయోగపడెడిది. కాని చాల ఖరీ దుగా నుండుటవలన కుంకుమపువ్వులోని రం గుపదార్థమును కనుగొని పాశ్చాత్యు లన్య విధముల రసాయనప్రయోగములచేత పృథ క్కరణ మొనర్చుచున్నారు. ఇటులనే నీలి మందు, కర్పూరము, రబ్బరు మొదలగు ప్ర కృతిప్రసాదములను పాశ్చాత్యులు శాస్త్ర దేవత కాహుతిజేయుటవలన హిందూ కోశా గారములు శోకాగారములుగా మారినవి. కుంకుమపువ్వులోని వర్ణహేతువును శాస్త్ర ములో క్రాసిను * యని యందురు. ఈ వర్ణ ములతోనే బట్టలకు రంగువేయుదురు. కొన్ని రంగులు వేయుటకు పూర్వము బట్టలకు మరి కొన్ని అద్దకములవంటి పదార్థములను కల పినగాని పిదపవేసిన రంగుపట్టదు. కాని యీ కుంకుమపువ్వులోగల క్రాసినులను వేయుట కట్టి పూర్వపరిశ్రమ యేమియు నక్కరలేదు. దీని రంగు వంగపండునుండి యెరుపువరకుగల తరములలో నుండును. సాధారణముగా కుం కుమపువ్వుతో రంగువేయునపుడు కుసుమ

---

* ఈ క్రాసినులు సజీవరసాయనమగు సుగంధ వర్ణములు. అనగా ఇట్టివి సుగంధముగల కొన్ని పదార్థములు కొన్ని యితర రసాయనప్రయోగముల వలన సుగంధవర్ణము లగుచున్నవి. ఆ నూతన పదార్థములకు తొలుతగల వాసనయు, పిదపవచ్చిన వర్ణమును కలవు. ఇట్టి విపరీతధర్మములుగలవి క్రాసినులు. ఈపేరు 'క్రాకస్‌సటైవస్' యనబడు కుంకుమపువ్వుయొక్క శాస్త్రనామమునుండి వచ్చి నది. ఇటులనే 'డాకస్ కరోట' యనబడు కారటు దుంపలోని వర్ణహేతువును కారొటిన్ యనియు, 'లైకొపెర్సికమ్ ఎస్కులెంటమ్' యనబడు సీమ వంగలోని వర్ణమును లైకొపెర్సిసిన్ యనియును, ఆ ప్రత్యేకవర్ణము లెందెందుగలవో తెలియుటకు సులభముగా లాటినులో నామములను శాస్త్రకారులు పెట్టెదరు.

పువ్వు, మరికొన్ని పువ్వులను కలిపి కల్తీ చేయుచున్నారు. ఒకప్పుడు పెద్ద పట్నములలో తాంబూలములలో పడు కుంకుమపువ్వులో పలుచని కర్రముక్కలు రంగు వేయబడి యుండుట విశదమగును. ఇట్లు కల్తీచేసి పేరు పాడుచేసుకొనుటలో మనవారికిగల తెలివితేట లెక్కువ. స్వచ్ఛమగు కుంకుమపువ్వు తులము 1-కి రూపాయి యగును. శాస్త్రీకృతవర్ణములు బజారులలోనికి వచ్చి పడుచుండుటవలన కుంకుమపువ్వుయొక్క వాడుక రంగు వేయుటలో తగ్గినది. ఇక మిగిలిన దాని సుగంధము నానుకొని వ్యవహారములో నిప్పుడుండుటచే దీనిని మన సుగంధద్రవ్యములలో జేర్చుచున్నాము.

కుంకుమపువ్వులోని యెక్కువవాసన, రంగుగల భాగము పువ్వుయొక్క కర్ణికాముఖములు. ఈ పువ్వుగల యనులోమములో కర్ణికాముఖము మూడుజడలగా విడి పోడుగుగా నుండును. ఈజడలు చక్కని కుంకుమ రంగుగలిగి, యెక్కువ వాసనగా నుండును. శ్రేష్టతమమైన కుంకుమపువ్వు యీ కర్ణికాముఖములే.

కుంకుమ మొక్క దుంపలవలనే ప్రవర్ధమానమగుచున్నది. ఒకచోట ప్రాతబడియున్న దుంప చాల సంవత్సరములవరకు పూయుచునే యుండును. అనగా ప్రతి సంవత్సరము క్రొత్తదుంప భూమిలో తయారయి ప్రాత దుంప నశించుచుండును. ఆ క్రొత్తదుంప తిరిగి మొలకెత్తి, కాలచక్రమును ద్రిప్పుచుండును. మొక్కకు కాండముగా కనబడు భాగము బాగుగా దుబ్బుకట్టుచు, గుండ్రముగాగాక, యొకేవరుసలో విశాలమగుచున్న చోడి మొక్క మొదలువలె యుండగలదు. అనగా యాకుల మొదళ్లు ఒకదానికొకటి ప్రతిముఖముగానుండి యొకదానియొడిలో నింకొకటి చొచ్చియుండును. * ఆకులు సాధారణముగా నిట్ట నిలువుగా నుండును. ఇట్లు ఏకదళ బీజమునకు జెందిన 'లిల్లీ మొక్కల'లో సుమారు కానగును. ఆకు కాడల మొదలు గుల్లగా నుండును. పూవులన్నియు చిన్నవిగానుండి, గుత్తులుగుత్తులుగా నుండును. పూవులోని భాగములన్నియు రంగుగలిగియుండును— అనగా ఆకర్షణపత్రములు, కేసరములు, కర్ణికలు, కర్ణికాముఖములు మొదలైనవి. ఇందు అండాశయము కేసరముల పాదములకు దిగువ నుండును. ఈ కుంకుమపూవులు 'అర్ధనారీశ్వరములు.' అనగా ఒకే పువ్వులో స్త్రీపురుషావయవములు రెండు నుండును. అందుచేత నివి పురుషబీజముకొరకు అట్టె తాపత్రయపడ నక్కరలేదనుకొందుము. కాని సృష్టిస్వభావ మదికాదు. ఎల్లప్పుడును పురుషసంకరమునకే

* ఆకులకు సాధారణముగా, వానియందుగల యంగవివరములలో నూర్ధ్వాధోభాగములు రెండును సమము గానుండవు. మీదిభాగములో నెక్కుడు దట్టముగా నమర్చబడిన 'నిడుపుపసరుకణములు'ను, అధోభాగమున విడివిడిగా వాయుకణరసప్రయాణములు వీలగునటుల ముద్దపసరు కణములు నుండును. నిడుపుపసరుకణములవలన యెక్కువ 'కాంతిసంకలన'మగును. కాని అంత యెక్కువకాంతి సంకలన మనవసరమైనపుడు దానికి తగుపనిముట్లుకూడ నవసరమే. కుంకుమ మొక్కజాతులు విరివిగా ఎక్కువ సూర్యరశ్మికలిగి తేమలేని దక్షిణాఫ్రికాలో సహజముగా నెరుగుచున్నవి. వాటియునికిబట్టి, యందలి శీతోష్ణస్థితుల కనుగుణ్యముగా నున్నట్లు మొక్కల యంగవివరములుండును. అందువలన కుంకుమ ఆకులు ముద్దపసరుకణములలో తమ రెండుప్రక్కలను సమానముగా నుండును.

యెదురుచూచుచుండును. పై నుండి పురుష బీజము—పుప్పొడిని పొందుటకు ప్రతిపూవు ను తనయంగములను సరిచేసుకొనును. ఒక వ్వుడటు లన్యపురుషసంయోగముకాకుండిన అక్కడనగడే గతియన్నట్లు తనలోని పురుష బీజమే యాధారమగును. ప్రకృతి ధర్మాను సారము పురుషసంకరమున కీచిన్నకుంకుమ పువ్వు వేషముల నెన్నో వేయుచున్నది.

అండాశయముదగ్గర నొక మధుకోశము న్నది. అందలి మకరందమును త్రాగుటకు తేనెటీగలు మొదలైన చిన్నకీటకములు వచ్చు ను. ఈ మధుపిపాసచే మాటిమాటికి వచ్చు కీటకములే పురుషబీజవాహనములు. ఒకే పూవులోని పురుషభాగముకన్న స్త్రీభాగము త్వరలో సంయోగమునకు సిద్ధముగ నుం డును. కర్ణికాద్వారము కేసరములకన్న ముందుగా నదిగి తేనెటీగలు పూవులోనికి పోవుదారి కడ్డముగా సంపర్కమునకు సమ్మ తించిన కర్ణికాద్వారము తెరచియుండును. కీటకముల కీద్వారము దాటిపోయిన లోపల పుప్పొడి కేసరములలో విడియుండును. ఆ భాగముకూడ దాటి లోపలకుపోయిన య ప్పుడు మకరందము దొరకును. కీటకములు ప్రతిపువ్వులోనికి పోవుచు తిరిగి వచ్చుచుండును కదా. అట్లుచేయునపుడు వాటిశరీరమునకు బాగుగా పుప్పొడి యంటుకొనును. మకరంద మును త్రాగిపోయి మరొక యర్ధనారీశ్వరి లోనికి పోయినపుడు వాటినిదివరకే యంటు కొనియున్న పుప్పొడి దారికెదురుగా నిలువ పడియున్న కర్ణికాముఖమును ముద్దాడి మరి పోవును. ఇకనేమున్నది ? బీజసంకరము – పిం డోత్పత్తి – ప్రకృతివాంఛాఫలితము !

కాశ్మీరములో కొండలోయలలో దీనిని వేయుచు పెంచుచున్నారు. 5, 6 సంవత్సర ములనుండియేపంట లేనటువంటి, భూములలో నే దీనికృషి. ఆ ప్రాంతములలో సారవంత మగులోయ లెన్నైననను కలవు. గత్తమువే యుట వాడుకలేదు. వీటిని జూలైలో పాతు దురు. అక్టోబరు నాటికి పూతబట్టును. అది యే పంటకాలము.

మొదట పూవులనెండబెట్టి కర్ణికాముఖ ములను కోసివేయుదురు. బ్రహ్మవిష్ణుమహే శ్వరత్రయము నేనేయన్నటు లీయర్ధనారీశ్వర పుష్పముల కర్ణికాముఖము మూడుపాయలై యుండునని నెరిగితిమి. ఇవి చాల వాసన, కుంకుమరంగు కలిగియుండును. ఇదియే మొ దటిరకపు కుంకుమపువ్వు.

పిదప పువ్వులను కర్రలతోగొట్టి నీట బడ వేయుదురు. మిగిలిన భాగముల వేరేదీసి యుంచుదురు. ఇవి వాసనలోను, వర్ణము లోను రెండవరకము.

వ్యాపారములో, మొదటిరకమును 'మంగ్లా' యనియును, రెండవరకమును 'నివాల' యనియును వాడుక.

ఉపయోగములు:—(1) తొలుత రంగు వేయుట కుపయోగపడునని దీర్ఘముగా వివరిం చితిమి. బట్టలకు వేయుట తగ్గినను ధనికు లుత్త రహిందూదేశమున తిలకములలో కలిపి పెట్టు కొందురు. ఆతిలకమునకు కుంకుమవాసన, రంగు ఉండును. (2) పిండివంటలలో (జిలేబి, పాయసము, లడ్డు మొదలగునవి) మనము సాధారణముగా వాడుకచేయుచున్నాము. (3) పెక్కు ఔషధములలో కూడ కలియు చున్నది. (4) భోగులు తాంబూలమున వాడు చున్నారు.

విలాసమున కిట్టియుపయోగకరమగుచు, ఎక్కువ ఖరీదునకుగాని దొరకని యీ

చక్కని చిన్న పువ్వుమొక్కను దొడ్లలో గాని పొలములలోగాని వేసి పెంచుట యెంతయో ఆనందముగా నుండుననుటలో నతిశయోక్తి లేదు.

సూచన.—విషయము పూర్తిగానుండుటకు వలసినచోట గూఢశాస్త్రభాగములలోనికి పోయియుంటిని. మరియు పూర్తిగాగల శాస్త్రపాఠములను ఫుట్‌నోట్సులో నిచ్చితిని. కొన్ని శాస్త్రసంకేతపదములకు వాని యాంగ్లపదముల నిట నిచ్చుచున్నాను.

కుంకుమపువ్వు - Crocus Sativus.
పృథక్కరణము - Synthesis.
క్రొసినులు - Croceins.
సజీవరసాయనము - Organic.
'సుగంధవర్ణములు' - Azo dyes.
కొన్ని అద్దకములవంటి పదార్థములు - Mordants.
కర్ణిక - Style.
కర్ణికాముఖము - Stigma.
కేసరములు - Stamens.
అండాశయము - Ovary.
నిడుపు పసరు కణములు - Palisade.
ముద్ద „ „ - Spongy tissue.
కణరసము - Cell-sap.
కాంతిసంకలనము - Photo synthesis.
అర్ధనారీశ్వరములు - Hermophrodites.

# గర్భవతులు అంటిముట్టరానిపండు

రచయిత:

పి. బ్రహ్మాజీరావు, యం.బి.,బి.యస్.

గర్భవతులు దేహపోషణ బాగాజరగడానికీ, మలప్రవృత్తి సరిగ్గా అవడానికి ఫలాలు బాగా తినాలిఅని డాక్టర్లు అందరూ చెపుతారు. దీన్నిబట్టి చూలింతరాళ్ళకు ఫలాలు అవశ్యకమైన ఆహారమని తెలిపోతోంది. అయితే అట్టి అవశ్యకమైన ఆహారానికి చెందిన ఫలజాతితో గర్భిణీస్త్రీలు వేలేసి ముట్టుకోకూడని ఫలంకూడా ఒకటివుందని తెలుసుకోడానికి చాలాఆశ్చర్యంగావుండకమానదు. ఎంత ఆశ్చర్యంగావున్నా ఆవిషయం తెలుసుకోవడం చాలాముఖ్యం. ఏమంటారా ఆపండు తింటే గర్భిణీస్త్రీలు చాలా ప్రమాదకరమైన అవస్థకు లోనవుతారు. ఆఫలంతింటే కలిగే హాని తెలుసుకుని స్త్రీలు చూలునిలిచింది మొదలుకొని దాన్ని అంటకుండానూ, ముట్టకుండాను వుండడం చాలామంచిది. ఆఉద్దేశంతోనే ఈవ్యాసం వ్రాస్తున్నాను.

ఇంతకీ గర్భిణీస్త్రీలు వేలేసి ముట్టుకోకూడని ఆపండుపేరేమిటో అని చాలామంది పాఠకులు తమతమ మనస్సుల్లో ప్రశ్న వేసుకుంటూవుండవచ్చు. కాబట్టి ముందుగా ఆపండు పేరు చెపుతున్నాను. గర్భిణీస్త్రీలు వేలేసి ముట్టుకోకూడని పండు అనాసపండు.

అయితే అనాసపండునుగూర్చిన ఈనిషేధాన్నిగూర్చి మన ప్రాచీనవైద్యగ్రంథాలు ఏమీచెప్పడంలేదు. అసలు అనాస పూర్తిగా విజాతీయఫలం. అది మొగలాయిప్రభువుల కాలంలో మాత్రమే మనదేశానికి వచ్చింది. విశేషమైన రుచిగలఫలం కాబట్టి అది కొద్ది రోజుల్లోనే దేశం అంతా వ్యాపించి ఈదేశంలో ఆబాలగోపాలం ఎరిగిన జాతీయఫలంగా మారిపోయింది. దీనకి మన దేశభాషల్లో ఒక దానిలోకూడా ప్రత్యేకంపేరులేదు. మనకు నూతనమైంది కాబట్టే దీన్నిగూర్చి మన ప్రాచీనవైద్యగ్రంథాలు ఏమీచెప్పిఉండక పోవడం సంభవించింది.

ఈ వ్యాసంలో అనాసపండుయొక్క చరిత్రకాని, దాని ఇతరఓషధీగుణాలుకాని చెప్పడం నాఉద్దేశంకాదు. ఇది ఎట్లు, ఏల గర్భిణీస్త్రీలకు నిషేధమైందో మాత్రమే చెప్పడం నాసంకల్పం.

అనాస సంబంధమైన ఆకులకు, కాయలకు, పండ్లకుకూడా జారీగుణమేకాని గ్రాహిగుణంలేదు. అనాసఆకులలోని పైబెరడుతీసి లోపలి తెల్లగుంజులో పంచదార కలుపుకుని తింటే ఆముదంపుచ్చుకున్నప్పటికంటే కూడా గాఢంగా విరేచనాలు అవుతాయి. ఏవైద్యుడున్నా ఎట్టిస్థితిలోకూడా కడుపుతోవున్న వారికి గాఢంగా విరేచనాల్నిచేసే మందుల్ని ఇవ్వడు. గాఢంగా విరేచనంచేసే గుణం అనాసఆకుల్లోనే కాకుండా కాయల్లోనూ, పండ్లల్లోనూకూడా వుంది. అనాసకాయలికి చర్మాన్నికూడా తినివేసేశక్తి వుంది. మనం విడవకుండా ఒక గంటసేపుగనక అనాస

కాయల్ని ముక్కలుగాకోస్తే మనకు ఈ సంగతి అనుభవపునరుక్తం అవుతుంది. ఏమంటారా అట్లా కోసేటప్పుడు మనవ్రేళ్ళకు తగిలే అనాసరసం మనవేలిగోళ్ళను చుట్టి వుండే సున్నితమైన చర్మాన్ని తినివేస్తుంది. ఇట్టి గుణంగల ఫలరసాన్ని అతిసుకుమారమైన మరోప్రాణాన్ని గర్భంలో ధరించివున్న స్త్రీలకు ఇవ్వడం ప్రమాదకరమైందని ప్రత్యేకం చెప్పవలసిన అవసరంలేకుండానే గ్రహించుకోవచ్చు.

సున్నితచర్మాన్ని తినివేయడమే కాకుండా అనాసపండురసంలో స్త్రీల గర్భాశయాన్ని సంకోచపరిచే తీవ్రగుణంవుంది. కాబట్టే గర్భవతులు అనాసపండును తింటే గర్భపాతం కలిగి తీరుతుంది.

ద్రాక్షతరువాత అనాసపండులోనే విస్తారం చక్కెరవుంది—రాగి, ఇనుము, మేంగనీసు, కాల్షియము, ఫోస్ఫరస్ మున్నగు లోహాలు అనాసపండులో మంచిపాళ్ళలో వున్నాయి—ఆమ్లపిత్తాన్ని, సోఫను పోగొట్టడంలో అనాస ప్రశస్తమైంది—టైఫాయిడ్ క్రిములను చంపడంలో పెట్టిందిపేరు కాబట్టి సన్నిపాతరోగులకుకూడా అమెరికావారు అనాసపండును నిషేధింపరు—ఇన్ని మంచిగుణాలు వున్నా గర్భపాతాన్ని గలిగించేదుర్గుణం వుండడంచేత ఇది గర్భిణీస్త్రీలకు అంటిముట్టరాని పండు అయింది.

అనాసపండుయొక్క ఈగుణాన్నిగూర్చి అభిప్రాయాలిచ్చిన కొందరు సుప్రసిద్ధులగు డాక్టరుల వాక్యాలను ఉదాహరిస్తాను.

1. కాలికట్టులోని సర్జన్ మేజరు హెన్రీ డేవిడ్ కుక్ గారి అభిప్రాయము: 'పచ్చి అనాసకాయ రహస్యగర్భస్రావాలకు ఉపయోగింపబడుతూన్నది.'
2. కలకత్తాలోని అసిస్టెంటు సర్జన్ దేవంద్ర నాధరాయిగారి అభిప్రాయము: 'అనాస గర్భపాతాన్ని కలిగిస్తుంది.'
3. మాంఘీరునందలి బ్రిగేడ్ సర్జన్ యఫ్-హెచ్. ఛారన్టన్ (బి.ఏ., యం.డి.) గారి అభిప్రాయము: 'మోతాదుమించి అనాసఫలరససేవనచేస్తే గర్భాశయం గాఢంగా సంకోచం పొందితీరుతుందని నమ్మబడుతూన్నది.'
4. సేలమునందలి సర్జన్ మేజరు యఫ్.యఫ్. యల్. రాట్టన్ గారి అభిప్రాయము: 'రహస్యగర్భస్రావాలకు అనాస వాడబడుతూంది.'
5. గంజామునందలి హానరరీసర్జన్ పి. కిన్సులే గారి అభిప్రాయము: 'మలాకాస్ట్రెయిట్సునందు అనాస ఆకులరసం గర్భపాతం కలిగేనిమిత్తం వాడబడుతూంది. బాగా పండిన అనాసపండురసంకూడా తీవ్రతలో కొంత తగ్గివున్నా అట్టిగుణాన్నే కలిగి వుంటుంది.'
6. పఞ్జాయందలి సర్జన్ మేజరు ఆర్.యల్. దత్తు (యం.డి) గారి అభిప్రాయము: 'అనాసపండురసం బాగా ఆరోగ్యంగా వున్న గర్భవతులకు ఏవిధంగానూ హాని చేయకపోవచ్చుకాని బలహీనలున్నూ, ఇదివరకు ఎప్పుడైనా గర్భస్రావంకలిగినవారున్నూ అయిన గర్భవతులకు ఇది తప్పకుండా హానికలిగిస్తుంది. స్త్రీలగర్భాశయానికి ఉద్రేకంకలిగించే దుర్గుణం అనాసలో విస్తారంగావుంది.'

విస్తరించి పువ్వులవాసనల్ని ఆస్వాదించే మధుకరాంగనలకు సంపెంగవాసనలాగ విస్తరించి ఫలభక్షణం చేయవలసివుండే గర్భవతులకు అనాసపండు తినతగనిది అయింది.




## ౧౬౭. విప్రకులదర్పణము.

బ్రాహ్మణకుటుంబముల చరిత్రములను సంచికలుగా వెలువరించుటకు పత్రికరూపమున ప్రతిమాసమునందు 5, 20- వ తేదీలయందు వెలువడుచుండును. మొదటి రెండు సంచికలును మాకార్యాలయమునకు పంపబడినవి. ఏడాదిచందా అంచెకూలితో రూ 5. చిరునామా శ్రీసత్తిరాజు సీతారామయ్యగారు, కంతేరు, తణుకుతాలూకా, పశ్చిమగోదావరిజిల్లా.

## ౧౬౮. నివేదనము

రచయితలు ఆకొండి వెంకటశాస్త్రిగారు. పండితులగు ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిగారిని ఎవరో ఈనాడు కవులు కాదనగా వారికొమారులగు వెంకటశాస్త్రిగారు రోషము వహించి వ్రాసిన పద్యముల చిన్నపుస్తక మిది. వలయువారు గ్రంథకర్త పేర పశ్చిమగోదావరిజిల్లా కొకరపర్రునకు వ్రాయునది.

## ౧౬౯. రాఘవశతకము

వేదవభట్ల వెంకన్నప్రణీతము. భక్తిరసప్రధానమైన శతకము. వెంకన్నగారు ఏడెనిమిది సంవత్సరముల వరకు జీవించియుండిన ఆధునికులేయయ్యు కవిత్వమును ప్రాక్తనపద్ధతిని నడపిరి. ఈగ్రంథమును విస్మృతిగహనము పాలుకాకుండ అచ్చువేయించిన శ్రీతాత కృష్ణమూర్తిగారిని ప్రశంసింప వలసియున్నది. వెల రు 0-2-0. ప్రతులకు ప్రచురణకర్తల పేర భద్రాచలము వ్రాయునది.

## ౧౭౦. థియాసఫీ

1936 మే 7, 8, 9, తేదీలలో బొంబాయి నగరమున సర్ యస్. రాధాకృష్ణన్‌గారు అధ్యక్షతను జరిగిన మతముల పార్లమెంటుసభలో సోఫియావాడియాగారు థియాసఫీనిగూర్చి ఆంగ్లమున ఇచ్చిన ఉపన్యాసమున కిది గ్రంథరూపము. గ్రంథముద్రణము సుందరముగ నున్నది. వెల రు 0-4-0. చిరునామా - థియాసఫీ కంపెనీ (ఇండియా) లిమిటెడ్, 51 ఎస్ప్లనేడ్ రోడ్, ఫోర్టు, బొంబయి, (ఇండియా).

## ౧౭౧. దివ్యవాణి

మామిత్రులు ముద్దా విశ్వనాథముగారు ఆంధ్రసేవాప్రసూనముల ద్వారాచేయుచున్న ఆంధ్రసేవ కొనియాడ తగియున్నది. ఇంతవఱకు వారు పంద్రెండు గ్రంథములను ప్రచురించిరి. అందు ప్రస్తుతము మన విమర్శనమునకు పాల్పడిన దివ్యవాణి పంద్రెండవ పుష్పము. ఇది సుప్రసిద్ధులగు శ్రీకూచి నరసింహము పంతులుగారు (బి. ఏ.) రచియించినది. ఒక హరిజనునికథ. శ్రీ ఎస్. ఎమ్. చక్రవర్తి, ఎం. ఏ., గారు 30-9-1934-వ తేది ఆదివారపు 'అమృతబజాఱు'ద్వైవారపత్త్రికలో ప్రకటించిన ఆంగ్లకథావ్యాసమునకు తెనుఁగు. అనువాదకశైలి అతిప్రశస్తముగనున్నది. ఏఃంచియాంటిక్ కాగితములమీద పుస్తకము అతి సుందరముగ ముద్రింపబడియున్నది. వెల రెండుఅణాలు మాత్రమే. చిరునామా: వ్యాసకుటీరము, మేలుపాక, (వయా) ఎలమంచిలి, విశాఖపట్టణము మండలము.

## ౧౭౨. ఆంధ్రసేవ

ఈనూతన పత్రికకు మంచి స్వాగతము చేయుచున్నాము. ఇది తెనుగున ఒక క్రొత్తరీతి పత్రిక. పుస్తకప్రచారమునకు తోడ్పడు వ్యాసములు, విమర్శలు, కవిజీవితములు మున్నగునవి మాత్రము ప్రచురించు పత్రిక. విమర్శనార్థము పంపబడిన తొలిసంచికలో 'విద్య-గ్రంథపఠనము' అను శ్రీకూచి నరసింహము పంతులుగారి (బి. ఏ.) వ్యాసమునకు పూజ్యస్థాన మీయబడుట ఎంతయు సముచితముగ నున్నది. ఆంగ్లమునందలి బుక్కునోట్సు పద్ధతిని పరిచరింప

బడుచున్న ఈపత్రిక తెనుగువారి ఆదరాభిమానములకు పాత్రమగుగాక! చిరునామా: శ్రీముద్దా విశ్వనాథముగారు, మేలుపాక, (వయా) ఎలమంచిలి, విశాఖపట్టణముమండలము.

### ౧23. నందనార్

భక్తిరసప్రధానమగు ఐదంకముల నాటకము. గ్రంథకర్త: పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారు. పంచముడగు నందనార్, అరవదేశమున తన అపూర్వభక్తిమహిమచే నిర్జలప్రదేశములో జలము పుట్టించుట, దేవాలయమున నందిని ప్రక్కకు జరుపుటమున్నగు అద్భుతకృత్యము లొనరించి తెనుగువారి భద్రాచల రామదాసునకు దీటుఅగుచున్నాడు. మాలలను తాకినను, దారిలో తారసిల్లినను, తుదకు చూచినను మైలపడి పోవుదుమనుకొను ఛాందసుల మనస్సును సహితము మార్పగలుగు ఇతివృత్తముతో ఒప్పుచున్న నంధనార్ కథ హరిజనసమస్యను గూర్చి నేడు విశేషముగు ఆందోళనము చేయుచున్న దేశహితైషులకును, సంఘసంస్కర్తలకును దివ్యసందేశము నొసంగజాలియున్నది. ఇదే ఇతివృత్తముతో తెనుగున మరికొన్ని నాటకములు బయలుదేరినవి. కాని వానియన్నిటికంటె రచనావిధానము నందును, కథాసంవిధానమునందును ఇది గుణవత్తరముగా నున్నది. అగుటనే దేశోద్ధారక, విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు (ఎం. ఎల్. ఎ) దీనికి కృతిభర్తలయినారు. ప్రతి వెల రు 0-12-0. పోస్టేజీ ప్రత్యేకము. గ్రంథకర్తపేర బ్రాహ్మణవీధి, బెజవాడకు వ్రాసిన ప్రతులు లభించును.

### ౧౨౪. అనంతపుర మహిళా

#### పాఠశాల వార్షిక సంచిక

1936 జూలైమాసమున వెలువడిన అనంతపుర మహిళాపాఠశాలవారి నాల్గవ వార్షిక సంచికను అందుకొనుటకు ఆనందితుల మగుచున్నాము. మా మిత్రులు శ్రీయుత సీరిపి ఆంజనేయులుగారు దీనిని యథారీతిని సంపాదించియున్నారు. ఆంగ్లమునను, ఆంధ్రమునను వ్యాసములు ప్రచురింపబడినవి. వ్యాసములన్నియు విద్యార్థినులచే వ్రాయబడినవగుట మెచ్చదగినది. ఆంధ్రవ్యాసములందు కొన్నికొన్ని అమూల్యమైనవిగానున్నవి. ఎ. సత్యవతీబాయి వ్రాసిన 'సౌగసనగనేమి?' అను వ్యాసము ప్రత్యేకము ప్రశంసింపదగియున్నది. సంచిక కంఠమును 'స్త్రీలు: శిరోజములు' అను సచిత్రవ్యాసము అలంకారప్రాయముగ నున్నది. తమ విద్యార్థినులను సారస్వతవ్యాసంగమున నిలిపి ఏటేట ఇట్లు సంచికను వెలువరించుచున్న శ్రీయుత సీరిపి ఆంజనేయులుగారి కృషికి జయవెట్టుచున్నాము.

### ౧౨౫. జనవాణి

ఈ క్రొత్త తెనుగుదినపత్రిక అవతరణముతో ఆంధ్రవార్తాపత్రికల చరిత్రయందు ఒక నూతనాధ్యాయము ప్రారంభమైనదనవచ్చును. డెయిలీ మెయిలు అవతరణముతో ఆంగ్లపత్రికలచరిత్రయందు ఎట్లు నూతనశకము ప్రారంభమైనదో అట్లే సంచిక ఒకటికి కానీవెలగల జనవాణిపత్రిక పుట్టుకతో ఆంధ్రపత్రికల చరిత్రయందు నూతనశకము ప్రారంభమైనదని చెప్పవచ్చును. వెలనుబట్టియేగాక వార్తల ప్రదర్శనమునుబట్టికూడ ఈపత్రిక మిక్కిలి వరణీయమైనదగుచున్నది. మొదటిపేజీయందును తుదిపుటయందును స్ఫుటాక్షరములతోనుండుచున్న వివిధవార్తల శీర్షికలు చూచినంతమాత్రముననే ఆనాటి వార్తావిశేషములన్నియు అవగతమగుచున్నవి. పాశ్చాత్యపత్రికల ఈతీరు తెనుగువారికి చూపినకీర్తి జనవాణిదే. ఆంగ్లమున పట్టభద్రులై, ఆంధ్రమున విజయవిలాసమువంటి ప్రౌఢప్రబంధమునకు వ్యాఖ్యవ్రాయగలిగిన విశేషపాండిత్యము నలవఱచుకొనిన శ్రీ తాపీ ధర్మారావుగారు ఈపత్రికకు సంపాదకులగుట తెనుగువారి యదృష్టమే. చిరునామా: 2/16 మౌంటురోడ్డు, మదరాసు.

Printed at The Andhrabhumi Printing Works, Vepery, Madras
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.